Gr. ... R.K. ...

శ్రీ ర స్తు

# గోచార రత్నాకరము

రచయిత:

వడ్డాది వీర్రాజు



వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్
26, రామానుజ అయ్యర్ వీధి, చెన్నై - 600 021
వారిచే ప్రకటితము
నెం. 152 హస్తినాపురం కాలనీ (దక్షిణం)
నాగార్జునసాగర్ రోడ్డు, హైదరాబాదు-500 074

 Rs: 30.00

G. M. R. K. [illegible]

# పీఠిక

****

గోచారమనగా గ్రహచారము అని భావము. చారము అనగా సంచారము. నక్షత్రమండలమునందలి గ్రహసంచారము ననుసరించి మానవులకు కష్టసుఖములు ప్రాప్తించుచుండునని మన పూర్వులైన మహర్షులు కనుగొనిరి.

జన్మనక్షత్రమునుబట్టి జన్మరాశిని తెలుసుకొనవలయును. ఆ జన్మరాశికి సూర్యాది నవగ్రహములు ఏయే స్థానములలో నున్నవో తెలుసుకొని, గ్రహములు ఆయాస్థానములలో నున్నప్పుడు కలుగజేయుఫలితములను యీగ్రంథఆధారముచే నెఱుంగవలయును. జన్మనక్షత్రము తెలియనివారు నామ నక్షత్రమునుబట్టి వచ్చురాశివలన గోచార ఫలితములను చూచుకొనవచ్చును.

గోచారఫలితములు జరుగవనియు, ఋజువుగ నుండవనియు, జాతకమునుబట్టి నడుచు దశాంతర్దశాఫలితములు మాత్రమే సరియైనవనియు కొందరు చెప్పుచుందురు. అట్టి మాటలు కేవలము సత్యదూరములు. జాతకమునుబట్టి దశాంతర్దశాఫలితములు చెప్పునప్పుడు తాత్కాలిక

గోచారమునుకూడ తప్పక చూడవలయునని జ్యోతిశ్శాస్త్రము నందు చెప్పబడియున్నది. నా అనుభవములో గోచారమును బట్టి చెప్పిన ఫలితములు [illegible] తప్పక జరిగినవి. జాతకమునుబట్టి దశాంతర్దశాఫలితములను చెప్పుటకంటె గోచార ఫలితములు చెప్పుట మిక్కిలి సులభము. గోచారఫలితములు సరిగ జరుగుచుండుట నేను గమనించితిని. ఒక్క గోచారమునుబట్టియే అనేక విషయములు అద్భుతముగ చెప్ప గలిగినవాడను.

గోచారఫలితములను గురించి పరాశర, వసిష్ఠ, వ్యాస, భృగు, గౌతమాది మహర్షు లెందరో విపులముగ వ్రాసి యున్నారు. ఆ గ్రంథముల నన్నింటిని చదువవలయునన చాలకాలము పట్టును. గోచారఫలములు తెలుసుకొనుటకు అధిక ముగ కృషి సలుపుటకు ప్రతివారికి సాధ్యముకాక పోవచ్చును. కనుక ఆ గ్రంథము లన్నిటియందునుగల విశేషములను సంగ్రహించి, ప్రతివారికిని సులభముగ బోధపడునట్లు యీ గ్రంథమును వ్రాసియుంటిని.

గోచారఫలితములు తెలుసుకొనుటకు తెలుగుభాషలో గ్రంథములు చాల తక్కువగ నున్నవి. ఆట్టిలోటును గుర్తించి సర్వజనోపయుక్తముగ నుండునట్లు నే వీగ్రంథమును వ్రాసి యున్నాను.

గోచారమునుకూడ తప్పక చూడవలయునని జ్యోతిషశాస్త్రము నందుచెప్పబడియున్నది. నా అనుభవములో గోచారమును బట్టి చెప్పిన ఫలితములు తూ. చ. తప్పక జరిగినవి. జాతక మునుబట్టి దశాంతర్దశాఫలితములను చెప్పుటకంటె గోచార ఫలితములు చెప్పుట మిక్కిలి సులభము. గోచారఫలితములు సరిగ జరుగుచుండుట నేను గమనించితిని. ఒక్క గోచారమునుబట్టియే అనేక విషయములు అద్భుతముగ చెప్ప గలిగెడివాడను.

గోచారఫలితములను గురించి పరాశర, వసిష్ఠ, వ్యాస, భృగు, గౌతమాది మహర్షు లెందరో విపులముగ వ్రాసి యున్నారు. ఆ గ్రంథముల నన్నింటిని చదువవలయుననిన చాలకాలము పట్టును. గోచారఫలములు తెలుసుకొనుటకు అధిక ముగ కృషి సలుపుటకు ప్రతివారికి సాధ్యముకాక పోవచ్చును. కనుక ఆ గ్రంథము లన్నిటియందునుగల విశేషములను సంగ్ర హించి, ప్రతివారికిని సులభముగ బోధపడునట్లు యీ గ్రంథమును వ్రాసియుంటిని.

గోచారఫలితములు తెలుసుకొనుటకు తెలుగుభాషలో గ్రంథములు చాల తక్కువగ నున్నవి. అట్టిలోటును గుర్తించి సర్వజనోపయుక్తముగ నుండునట్లు నే నీగ్రంథమును వ్రాసి యున్నాను.

# పీఠిక

జ్యోతిష శాస్త్రమెరుగనివారికి భవిష్యతు అంధకారమువలె నుండును. వ్యాపారము, ఉద్యోగ ప్రయత్నములు, ఆరోగ్యము పొందుటకు చికిత్సలు, తీర్థయాత్రలు, నూతనప్రయత్నములు మొదలగునవి చేయుటకు భవిష్యత్తునందలి శుభాశుభ కాలములను గుర్తించుటవలన, శుభపలితములు కలుగును. మానవులు శుభాశుభకాలములను గ్రహచార ఫలితములను తెలుసుకొనుటకు దైవాంశ సంభూతులగు మహర్షులు "జ్యోతిష శాస్త్రము" న తెలిపియున్నారు.

ఈ గ్రంథమునందు అట్టి గ్రహచార ఫలితములను తెలుసు కొను విధానములు సర్వము విపులముగను, విశదముగను, ప్రతివారికి సులభముగ బోధపడు విధముగను తెలుపబడెను.

విధేయుడు

వడ్డాది వీర్రాజు

# విషయ సూచిక

| విషయము | పుట. |
|---|---|
| కాల ప్రమాణములు | 2 |
| లగ్న ప్రమాణములు | 4 |
| జ్యోతిశ్చక్రమునందు నక్షత్రములు | 5 |
| జన్మనక్షత్రమునుబట్టి రాశిని తెలుసుకొనువిధానము | 6 |
| నామనక్షత్ర నిరూపణ | 7 |
| సంయుక్తాక్షరము గల నామనక్షత్ర నిరూపణ | 9 |
| నవగ్రహములు | 10 |
| రాసులందు గ్రహములు వసించుకాలము | 10 |
| కేంద్ర త్రికోణములు | 11 |
| చర, స్థిర, ద్విస్వభావరాసులు | 11 |
| రాశ్యాధిపతులు | 11 |
| గ్రహముల జాతులు | 12 |
| గ్రహముల స్త్రీ పురుష నపుంసక వివరము | 13 |
| గ్రహముల నైసర్గిక శుభపాపత్వముల నిరూపణ | 13 |
| గ్రహదృష్టి | 13 |
| రాసుల దిక్కులు | 14 |
| గ్రహముల రంగులు | 14 |

విషయసూచిక

| విషయము | పుట. |
|---|---|
| గ్రహ కారకత్వములు | 15 |
| ద్వాదశ భావములు | 16 |
| ద్వాదశ రాసుల వర్ణములు | 19 |
| గ్రహములకు వాత పిత్త శ్లేష్మాధిపత్య వివరణము | 19 |
| గ్రహములకు ఉచ్చనీచ రాశులు | 20 |
| గ్రహముల శుభత్వ పాపత్వ వివరణ | 20 |
| ఓజయుగ్మ రాశులు | 21 |
| గ్రహముల గుణములు | 21 |
| రాసుల కులములు | 22 |
| గ్రహములకు మిత్ర, శత్రు, సమ, విషమ రాసులు | 22 |
| తారాబలమును తెలుసుకొను విధానము | 23 |
| తారలు | 24 |
| తారల శుభాశుభ ఫలనిరూపణ | 24 |
| తారల కధిపతులు | 25 |
| తారల వాహనములు | 26 |
| తారావాహన ఫలములు | 26 |
| అశుభతారలకు దానములు | 26 |
| తారలకు దోషగడియలు | 27 |

G.M.RKIS/'

విషయసూచిక


విషయము ... పుట.

గ్రంథాంతరమున అశుభతారలకు దోష ఘడియలు ... 27

గోచారమును చూడవలసిన విధానము ........................28

గోచార బలాధిక్యము ..............................................29

చంద్రబలమును తెలుసుకొను విధానము ....................29

చంద్రుని పూర్ణ మధ్యమ క్షీణత్వముల వివరము ........29

చంద్ర బలాబలములు ..............................................30

చంద్ర బలము ......................................................30

ప్రతిదినము గోచారము చూచుకొను విధము ..............31

ఇతర గ్రంథములలో దినచర్య తెలుసుకొనుటకు
మరియొక విధానము ..............................................32

దినచర్యాధిపతుల ఫలితములు .............................. 35

గోచార ఫలితములు తెలుసుకొను విధానము ..............36.

గ్రహములకు మూర్తులను నిర్ణయించుట ......................37

గ్రహ బల తారతమ్యము ..........................................38

శని, కుజ, గురు, చారఫలితములు ............................39

సంవత్సరములయొక్క శుభాశుభ ఫలితములను
తెలుసుకొను విధానము ......................................... 39

రవ్యాదిగ్రహములకు గోచారరీత్యా శుభాశుభ స్థానములు 40

## విషయసూచిక


విషయము | పుట
---|---
అశుభస్థానములు .................................................. | 41
ఏడున్నరఏండ్ల శని ................................................ | 42
గురుచారమునకు గోచార విశేషఫల నిర్ణయములు .. | 43
రవి. చంద్రరాహ్వాదుల ద్వాదశస్థానములలో సంచరించునప్పుడు కలుగు ఫలితములు .......... | 44
చంద్రుడు జన్మరాశి లగాయతు ద్వాదశస్థానముల యందు సంచరించునప్పుడు కలుగు ఫలితములు | 45
కుజుడు జన్మరాశి లగాయతు ద్వాదశరాశులయందు సంచరించునప్పుడు కలుగు ఫలితములు ............ | 45
బుధుడు జన్మాది ద్వాదశరాశులందు సంచరించునప్పుడు కలుగజేయు ఫలితములు ............ | 46
గురువు జన్మాది ద్వాదశరాశులందు సంచరించునప్పుడు కలుగు ఫలితములు ..... | 47
శుక్రుడు జన్మాది ద్వాదశరాశులందు సంచరించునప్పుడు కలుగజేయు ఫలితములు | 47.
శని జన్మాది ద్వాదశరాశులందు సంచరించునప్పుడు కలుగజేయు ఫలితములు ...................... | 48.

విషయసూచిక


విషయము పుట.

రాహుకేతువులు జన్మాది ద్వాదశరాశులందు సంచరించునపుడు కలుగజేయు ఫలితములు .... 48

రవి ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు ...... 49

చంద్రుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు ..53

కుజుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు .....57

బుధుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు ....61

గురుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు ....64

శుక్రుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు .....68

శని ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు ..........72

రాహుకేతువులు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు ...............76.

జన్మలగ్నమును తెలుసుకొను విధానము ...................80

రాశి చక్రమునందు గ్రహములువేయు విధానము .......81

అంశచక్రములో లగ్నమును తెలియజేయు విధానము ..82

గ్రహములకు వేధావిషయములను తెలుసుకొనుట .......83

గ్రంథాంతరములలో వేధల విషయములు ..................84.

వేధల ఫలితములు ....................................................86

గురుడు శుభమును కలుగజేయు నక్షత్రములు ............89

విషయసూచిక

విషయము ... పుట.

తారలయందు గ్రహ ఫలితములు ........................ 90
గ్రహముల బలములు ........................................ 90
నవగ్రహ పీడాహరణ, నవరత్న ముద్రికాలక్షణము ... 92
గ్రహ పీడశాంతికి సామాన్యశాంతులు ....................93
గ్రహములు ఫలితముల నిచ్చుకాలములు ................93
నక్షత్రములకు ప్రత్యేక గ్రహదృష్టి ...................... 94
గ్రహ వీక్షిత నక్షత్రఫలములు ..............................94
నక్షత్రములకు ద్విత్ర్యాది గ్రహదృగ్యోగ ఫలము ... 95
వక్రాది గ్రహముల ఫలములు ............................ 96
నక్షత్రముల జాతులు ...................................... 96
మేషాది ద్వాదశరాశుల లక్షణములు ......................97.
గ్రహముల కారకత్వములు ..................................103.
గ్రహములకు ప్రీతిదానములు ..............................116
మంత్రార్వణము మొదలగువానిని తెలుసుకొను విధానము ........119.
అర్వణచక్రము ................................................120
సిద్ధార్వణచక్రము ..........................................122
సిద్ధార్వణచక్ర ఫలితనిరూపణ ..........................124

విషయసూచిక


| విషయము | పుట. |
| --- | --- |
| ప్రకారాంతముగ అర్ఘ్యణచక్రము | 125 |
| మంత్రోపదేశమునకు శుభకరములైనవి | 126 |
| శనిదోషపరిహారమునకు | 129. |
| శని వస్త్రము | 129. |
| శని స్తోత్రము | 130. |
| సంవత్సర ఫలితమును తెలుసుకొను విధానము | 131. |
| మాస ఫలితము | 131. |
| గ్రహములకు ఆధిపత్య దేశవిభజనము | 134. |
| నక్షత్రములకు జాతిబేధములు | 134. |
| గ్రహములకు జన్మదేశములు | 135. |
| దేశములకు జన్మనక్షత్రములు | 135. |
| దేశములకు అరిష్టయోగములు | 137. |
| సంక్రాంతిఫలము తెలుసుకొను విధానము | 138 |
| చంద్రోదయ నక్షత్ర ఫలితములు | 139 |
| శుక్లపక్ష ప్రవేశ నక్షత్ర ఫలము | 139. |
| కృష్ణపక్ష ప్రవేశ నక్షత్ర ఫలము | 140 |
| జననకాలమునకు వచ్చు మహాదశల నెరుంగుట | 141 |
| మహాదశల ప్రమాణములు | 142 |

విషయసూచిక

విషయము పుట.

జననకాలమునకు జననకాల మహాదశయొక్క
భుక్తి తెలుసుకొను విధానము ......................143...

అంతర్దశాప్రమాణములను తెలుసుకొను విధానము ....144

విదశాప్రమాణములను తెలుసుకొను విధానము ..........145.

సూక్ష్మదశా ప్రమాణము ......................................... 146

ప్రాణదశా ప్రమాణము ...........................................146

గ్రామార్వణము.......................................................148

అంగగ్రహ సంచార ఫలచక్రము ............................149.

మనుష్య నైసర్గిక గుణనిరూపణకు నరాకార చక్రము 150.

****

శ్రీ ర స్తు

శ్రీ రామచంద్రాయ నమః

# గోచార రత్నాకరము

అను

# గోచార ఫలములు

****

## ఇష్టదేవతా ప్రార్థన

శ్లో. అచిన్త్యా వ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే,
సమస్త జగాదాధారామూర్తయే బ్రహ్మణే నమః.

## విఘ్నేశ్వర ప్రార్థన

శ్లో. యం బ్రహ్మ వేదాన్త విదోవదన్తి
పరం ప్రధానం పురుషంత ధాన్యే,
విశ్వోద్గతేః కారణ మీశ్వరం వా
తస్మై నమో విఘ్న వినాయకాయ.

## నవగ్రహ స్తోత్రము

శ్లో. ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయ చ,
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

****

## కాల ప్రమాణములు

మనుష్యుని యొక్క ఒకరెప్పపాటు కాలము = 1 తృటి

| | | |
|---|---|---|
| 18 తృటులు (రెప్పపాట్లు) | = | 1 కాష్ఠ (4/15 సెకనులు) |
| 30 కాష్ఠలు | = | 1 కళ (8 సెకనులు) |
| 12 కళలు | = | 1 క్షణము (4 నిముషములు) |
| 12 క్షణములు | = | 1 ముహూర్తము (48 నిముషములు లేక రెండు ఘడియలు) |
| 30 ముహూర్తములు | = | 1 దినము (24 గంటలు) అనగా ఒకరాత్రి ఒకపగలు |
| 7 అహోరాత్రములు | = | 1వారము లేక దినము |
| 15 అహోరాత్రములు | = | 1 పక్షము |
| 2 పక్షములు | = | 1 మాసము |
| 2 మాసములు | = | 1 ఋతువు |
| 3ఋతువులు | = | 1 అయనము |
| 2 అయనములు | = | 1 సంవత్సరము |

****

## రాశి చక్రము (1)

| | | | |
|---|---|---|---|
| మీనము | మేషము | వృషభము | మిథునము |
| కుంభము | ఇది సవ్యచక్రమనబడును. సవ్యచక్రములో రాసులను ఎడమనుండి కుడికి లెక్క పెట్టవలయును | | కర్కాటకము |
| మకరము | | | సింహము |
| ధనుస్సు | వృశ్చికము | తుల | కన్య |

## (2)

| | | |
|---|---|---|
| వృష / మిధు | మేష | మీన / కుంభ |
| కర్కాటక | ఇది అపసవ్య చక్రము | మకర |
| సింహ / కన్య | తుల | ధన / వృశ్చిక |

అపసవ్య చక్రమునందు గ్రహములను కుడినుండి ఎడమకు లెక్క పెట్టవలయును.

## లగ్న ప్రమాణములు

శ్లో. మీన మేషా చతుర్థండీ గోకుంభౌచ చతుర్థకమ్
పంచపాదే యుగ్మమృగౌ పంచార్థం చాపకర్కిణౌ
కౌర్పిసింహౌచ పంచార్థం పంచపాద స్తూలాంగనే
మేషాదీనాంతు లగ్నానాం మీనమేషం విదుర్బుధాః.

తా. మీన మేషములు 4 గడియలు (1 గం. 36 ని.); వృషభ కుంభములు గ. 4-30 వి.లు (గం. 1-48 ని.); మిధున మకరములు గ. 5-15 వి.లు (గం. 2-6 ని.); కర్కాటక ధనుస్సులు గ. 5-30 వి.లు (గం. 2-12 ని.); సింహ వృశ్చికములు గ. 5-30 వి.లు (గం. 2-12 ని.); తులా కన్యలు గ. 5-15 వి.లు (గ. 2-6 ని.) లు.

గమనిక:- ప్రతిసంవత్సరమును పై లగ్నప్రమాణములందు కొలదిగ మార్పు కలుగుచుండును. అందుచే పంచాంగమునందుండు స్ఫుటలగ్నప్రమాణములను మాత్రమే గ్రహించవలయును.

Gr. M. R K Sastry ..



## జ్యోతిశ్చక్రమున నుండు నక్షత్రములు

1. అశ్విని, 2. భరణి, 3. కృత్తిక, 4. రోహిణి, 5. మృగశిర, 6. ఆర్ద్ర, 7. పునర్వసు, 8. పుష్యమి, 9. ఆశ్లేష, 10. మఖ, 11. పుబ్బ, 12. ఉత్తర, 13. హస్త, 14. చిత్త, 15. స్వాతి, 16. విశాఖ, 17. అనూరాధ, 18. జ్యేష్ఠ, 19. మూల, 20. పూర్వాషాఢ, 21. ఉత్తరాషాఢ, 22. శ్రవణం, 23. ధనిష్ఠ, 24. శతభిషము, 25. పూర్వాభాద్ర, 26. ఉత్తరాభాద్ర, 27. రేవతి.

ప్రతి నక్షత్రమును 4 పాదములుగ భాగించిరి. అందుచే 27 నక్షత్రములకు 27 x 4 = మొత్తము 108 పాదములు వచ్చును. ఈ 108 పాదములను మేషాది పన్నెండు రాసులకు పంచగా :-

$$108 \div 12 = 9$$

అనగా ఒక్కొక్క రాశికి 9 పాదములు వచ్చును. అనగా అశ్విని నక్షత్రముయొక్క 4 పాదములును, భరణియొక్క 4 పాదములును, కృత్తికలో మొదటిపాదమును కలసి మేషరాశి యగుచున్నది. ఆ విధముగనే కృత్తికలో మిగిలిన 3 పాదములును, రోహిణి నక్షత్రముయొక్క నాలుగు పాదములును, మృగశిరలో మొదటి రెండుపాదములును కలసి

వృషభరాశి యగుచున్నది. ఏయే నక్షత్రముల పాదములు కలసి ఏయే రాశి యగుచున్నదో యీ క్రింద చూపబడెను.

## జన్మనక్షత్రమునుబట్టి రాశిని తెలుసుకొను విధానము

శ్లో. అశ్విని, భరణీ, కృత్తికాః పాదం మేషః
కృత్తికాస్త్రయః, రోహిణీ, మృగశిరార్థం వృషభం
మృగశిరార్థం, ఆర్ద్రా, పునర్వసూస్త్రయి మిథునం
పునర్వసోః పాదం, పుష్యమీ, ఆశ్రేషాంత్యం కర్కాటకం
మఖ, పుబ్బ, ఉత్తరాః పాదం సింహం
ఉత్తరాస్త్రయః, హస్త, చిత్తార్థం కన్య
చిత్తార్థం స్వాతి, విశాఖాస్త్రయ స్తులా
విశాఖః పాదం, అనూరాధా, జ్యేష్ఠాంత్యం వృశ్చికం
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢాపాదం ధనుస్సు
ఉత్తరాషాఢాత్త్రయః, శ్రవణం, ధనిష్టార్థం, మకరం
ధనిష్టార్థం, శతభిషం, పూర్వాభాద్రాస్త్రయః కుంభం
పూర్వాభాద్రాపాదం, ఉత్తరాభాద్రా, రేవత్యాంతం మీనం.

ఉదాహరణ:- ఒక జాతకుడు చిత్త 3-వ పాదములో జన్మించెనసుకొనుడు. చిత్త మొదటి రెండు పాదములు కన్యా రాశిలో చేరినవి. మూడు నాలుగు పాదములు తులారాశిలో చేరినవి. అందుచే జాతకుని జన్మరాశి తులారాశి అయినది.

ఈ విధముగ జన్మించిన నక్షత్రముయొక్క పాదమును తెలుసుకొని, ఆ పాదమునుబట్టి రాశిని తెలుసుకొనవలయును.

జన్మనక్షత్రమునుబట్టి వచ్చునది జన్మరాశి యనబడును. అనగా జననకాలమునకు చంద్రుడుండు రాశి జన్మరాశి యనబడును. జాతకములో జన్మలగ్నము వేరుగను, జన్మ రాశి వేరుగను నుండును. జననసమయముననుండు లగ్నము జన్మలగ్నమనఁబడును.

## నామనక్షత్ర నిరూపణ

1. చూ, చే, చో, లా --- అశ్విని
2. లీ, లూ, లే, లో ---- భరణి
3. అ, ఈ, ఉ, ఏ ---- . కృత్తిక
4. ఓ, వా, వీ, వూ ---- రోహిణి
5. వే, వో, కా, కి ---- మృగశిర
6. కూ, ఘ, జ, ఛా ---- ఆర్ద్ర
7. కే, కో, హ, హీ ---- పునర్వసు
8. హూ, హే, హో, డా ...... పుష్యమి
9. డీ, డూ, డే, డో ----- ఆశ్లేష
10 మా, మీ, మూ, మే ----- మఖ
11. మో, టా, టీ, టూ ------ పుబ్బ

12. టే, టో, పా, పి ------ ఉత్తర
13. పూ, షం, ణా, ఠా ------ హస్త
14. పే, పో, రా, రి ------ చిత్త
15. రూ, రే, రో, తా ------ స్వాతి
16. తీ, తూ, తే, తో ------ విశాఖ
17. నా, నీ, నూ, నే ------ అనూరాధ
18. నో, యా, యీ, యూ ------ జ్యేష్ఠ
19. యే, యో, బా, బీ ------ మూల
20. బూ, ధా, భా, ఢా ------ పూర్వాషాఢ
21. బే, బో, జా, జీ ------ ఉత్తరాషాఢ
22. జూ, జే, జో, ఖా ------ శ్రవణం
23. గా, గి, గూ, గే ------ ధనిష్ఠ
24. గో, సా, సీ, సూ ------ శతభిషము
25. సే, సో, దా, దీ ------ పూర్వాభాద్ర
26. దు, శ్యం, ఝా, థా ------ ఉత్తరాభాద్ర
27. దే, దో, చా, చీ ------ రేవతి

ఈ నక్షత్రములలో ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగేసి అక్షరములు కలవు. అవి వరుసగా ఆ నక్షత్రముయొక్క ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థపాదములుగ గ్రహింపవలయును.

ఉదా:- "రామారావు" అను పేరునందలి మొదటి అక్షరము "రా" అగుటవలన "పే, పో, రా, రి - చిత్త" అను సూత్రము ననుసరించి ఆ పేరుగల వారలకు చిత్తా నక్షత్రమున మూడవపాదము నామనక్షత్రపాద మగును.

కనుక జన్మ నక్షత్రము తెలియనివారు పైన తెలుపబడిన విధముగ నామనక్షత్రమును తెలుసుకొనవలయును.

## సంయుక్తాక్షరముగల నామనక్షత్ర నిరూపణ

శ్లో. కృష్ణో హ్రృష్ట శ్రీధరః క్షేత్రపాలో
జ్ఞానోభీమో భైరవశ్చేతి నామ్నాం
సౌమ్య స్స్వాతీ త్వష్ట్ర హస్తార్ద్ర మూలాః
పూర్వాషాఢాచాహంరేతాని సప్తః.

| | | | | |
|---|---|---|---|---|
| కృష్ణుడు | అనుపేరునకు | మృగశిర | 3-వ | పాదము |
| హ్రృష్టుడు | " | స్వాతి | 1-వ | " |
| శ్రీధరుడు | " | చిత్త | 1-వ | " |
| క్షేత్రపాలుడు | " | హస్త | 2-వ | " |
| జ్ఞానుడు | " | ఆరుద్ర | 3-వ | " |
| భీముడు | " | మూల | 3-వ | " |
| భైరవుడు | " | పూర్వాషాఢ | 3-వ | " |
| ఫణి | " | ఉత్తర | 3-వ | " |

| | | | | |
|---|---|---|---|---|
| ద్రౌపది | అను పేరునకు | స్వాతి | 3-వ | పాదము |
| యాదవ | " | జ్యేష్ఠ | 2-వ | " |
| ఎఱ్ఱన | " | మూల | 1-వ | " |

శ్లో. మారుతస్య తృతీయేచ ద్రోణ ద్రౌపది శబ్దయోః
క్షేమోదితేః పూర్వపాదే ఫణినామ్నోత్తర స్తథా,
యల్లనా యాచ నామాగ్ని ర్యజ్ఞినామా చ శక్రభే,
ఎఱ్ఱనా మూల నక్షత్రమితి నక్షత్ర సంజ్ఞకః.

అని యితర గ్రంథములందు తెలుపబడియుండెను.

## నవగ్రహములు

1. సూర్యుడు (రవి), 2. చంద్రుడు, 3. కుజుడు, 4. బుధుడు 5. గురుడు, 6. శుక్రుడు, 7. శని, 8. రాహువు, 9. కేతువు.

## రాసులందు గ్రహములు వసించుకాలము

శ్లో. బుధ శుక్రౌ రవిర్మాసం మాసం మాసార్ధతః కుజః
గురు ర్ద్వాదశ మాసాని త్రింశన్మాసం శనైశ్చరః,
రాహుంశ్చాష్టాదశశ్చైవ కేతు శ్చాష్టా దశస్తదా
చంద్రో దినద్వయం చార్ధం రవ్యాదీనాం క్రమాద్వదుః.

తా. ప్రతిరాశియందును రవి ఒకమాసమును; చంద్రుడు రెండున్నర దినములును అనగా రెండు దినముల ముప్పై ఘడియలును; కుజుడు ఒకనెలా పదునైదు దినములును;

బుధుడు ఒకనెలయు; శుక్రుడు ఒకనెలయు; గురుడు ఒక సంవత్సరమును; శని రెండు సంవత్సరముల ఆరు మాసములును; రాహువు ఒకసంవత్సరము ఆరు మాసములును; కేతువు ఒక సంవత్సరము ఆరుమాసములును సంచరించుచుందురు.

## కేంద్ర త్రికోణములు

శ్లో. లగ్నం చతుర్థం దశమం సప్తమం కేంద్రసంజ్ఞకమ్,
కేంద్రస్థానాని చత్వారి త్రికోణే నవపంచమే.

తా. లగ్నము, చతుర్థము, సప్తమము, దశమము కేంద్రస్థానము లనబడును. పంచమము, నవమము అనగా 5, 9 స్థానములు త్రిక్రోణములనబడును. లగ్నము కోణముగను, కేంద్రముగనుకూడ పరిగణింప బడుచుండును.

## చర, స్థిర, ద్విస్వభావరాసులు

మేష, కర్కాటక, తులా, మకరములు ---- చరరాసులు
వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు --- స్థిరరాసులు
మిథునము, కన్య, ధనుస్సు, మీనము--ద్విస్వభావరాసులు

## రాశ్యాధిపతులు

శ్లో. సింహ స్యాధిపతి సూర్యః చంద్రః కర్కటకేశ్వరః,
మేష వృశ్చికయో ర్భౌమః కన్యా మిథునయోర్బుధః.

ధనుర్మీన ద్వయోర్మంత్రీ తులావృషభయోర్భృగుః,
మకరే కుంభరాశౌ చ నాయక స్సూర్యనందనః.

తా. మేషమునకు అధిపతి కుజుడు; వృషభమునకు శుక్రుడును, మిథునమునకు బుధుడును, కర్కాటకమునకు చంద్రుడును, సింహమునకు రవియు, కన్యకు బుధుడును, తులకు శుక్రుడును, వృశ్చికమునకు కుజుడును, ధనుస్సునకు గురుడును, మకరమునకు శనియు, కుంభమునకు శనియు, మీనమునకు గురుడును అధిపతులు.

రవి, చంద్రులు మాత్రమే ఒక్కొక్కరాశికి అధిపతులగుచున్నారు. మిగిలిన గ్రహములు. రెండేసి రాసులకు ఆధిపత్యములు పొందిరి. అనగా శుక్రుడు వృషభ, తులలకును; బుధుడు మిథున, కన్యలకును; కుజుడు మేష, వృశ్చికములకును; గురుడు ధనుర్మీనములకును; శని మకరకుంభములకును అధిపతులగుచున్నారు.

## గ్రహముల జాతులు

గురు శుక్రులు బ్రాహ్మణులు, రవికుజులు క్షత్రియులు, బుధ చంద్రులు వైశ్యులు, శని శూద్రుడు, రాహువు చండాలుడు, కేతువు మ్లేచ్ఛుడు.

## గ్రహముల స్త్రీ పురుష నపుంసక వివరము

శ్లో. మంత్రిమంగళ మార్తాండాను శాంతిపురుషాన్ బుధాః,
సోమ శశిజమందాహి భృగుపుత్రాశ్చ యోషితః.

తా. రవి, కుజ, గురులు పురుషగ్రహములు; చంద్ర శుక్రులు స్త్రీగ్రహములు; బుధశనులు నపుంసక గ్రహములు. రాహుకేతువులుకూడ నపుంసక గ్రహములే.

## గ్రహముల నైసర్గిక శుభపాపత్వముల నిరూపణ

రవి, కుజ, శని, రాహు, కేతువులు నైసర్గిక పాపగ్రహము లనబడును. నైసర్గిక పాపగ్రహములు అశుభ ఫలితములను కలుగజేయుదురు. బుధ, గురు, శుక్ర, చంద్రులు నైసర్గిక శుభ గ్రహము లనబడును. నైసర్గిక శుభగ్రహములు శుభఫలితము లను కలుగజేయుదురు.

## గ్రహదృష్టి

శ్లో. పశ్యంతి సప్తమాంత్సర్వే శనిజీవకుజాః పునః,
విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురశ్రగాన్.

తా. రవి, చంద్ర, బుధ, శుక్రులు తామున్న రాశికి ఏడవ రాశిని, అందున్న గ్రహములనుకూడ చూచుచుందురు.

కుజుడు 4, 7, 8 రాశులను అందున్న గ్రహములనుకూడ చూచుచుండును. గురువు 5, 7, 9 రాశులను అందున్న గ్రహములను కూడ చూచును. శని, 3, 7, 10 స్థానములను అందున్న గ్రహములను చూచుచుండును.

## రాశుల దిక్కులు

1. తూర్పు -- మేషము, వృషభము, మిధునము
2. దక్షిణము -- కర్కాటకము, సింహము, కన్య
3. పడమర -- తుల, వృశ్చికము, ధనుస్సు
4. ఉత్తరము -- మకరము, కుంభము, మీనము

## గ్రహముల రంగులు

రవి రక్తశ్యామలమగు పాటలీపుష్పవర్ణము గలవాడు; అనగా ఎరుపురంగు గలవాడు. చంద్రుడు తెల్లనిరంగు గలవాడు. కుజుడు పద్మరాగమువంటి ఎఱ్ఱని రంగు కలవాడు. బుధుడు గరికవంటి ఆకుపచ్చని శ్యామలవర్ణము గలవాడు అనగా చిలుక ఆకుపచ్చరంగు గలవాడు. గురుడు పసుపు పచ్చని రంగు గలవాడు. శుక్రుడు మిక్కిలి తెలుపు రంగు గలవాడు. రాహువు కృష్ణలోహితమగు నలుపు రంగు గలవాడు, కేతువు చిత్రవర్ణము గలవాడు.

## గ్రహకారకత్వములు

రవి:- పితృకారకుడు; మరియు ఆత్మ, ఉష్ణము, రాజాశ్రయము, ఉత్సాహము, శిరోవ్యాధి, దీర్ఘకోపము, సాహసము మొదలగువానికి కారకుడు.

రాత్రి జన్మించినవారికి పితృకారకుడు శని. పగలు జన్మించినవారికి పితృకారకుడు రవి.

చంద్రుడు:- మాతృకారకుడు చంద్రుడు. మరియు చంద్రుడు బుద్ధి, జలగండము, సముద్రప్రయాణము, గాన కళా విద్యలయందు ప్రీతి మొదలగువాటికి కారకుడు.

కుజుడు:- సహోదరులు, భూమి, కోపము, యుద్ధము, ప్రయాణము, స్ఫోటకము, శస్త్రములు మొదలగువాటికి కారకుడు.

బుధుడు:- వ్యాపారము, శాస్త్రజ్ఞానము, విజ్ఞానము, శిల్పము, మాతామహులు మొదలగువాటికి కారకుడు.

గురుడు:- విద్య, గృహము, ధనము భూమి, శాస్త్ర జ్ఞానము, అధికారము, ఉద్యోగము, కీర్తి, దైవభక్తి, వేదాంతము తీర్థయాత్ర, సంతానము మొదలగువాటికి కారకుడు.

శుక్రుడు:-కళత్రము, వాహనము, సౌఖ్యము, భోగము, కీర్తి సౌందర్యము, సంగీతము, నాట్యము, కళలలో నిపుణత్వము,

కవిత్వము, నాటకాలంకారము, రాజకీయము, అధికారము, మంచివస్త్రములు, సేవకులు మొదలగువాటికి కారకుడు.

శని:- ఆయుర్దాయము, సేవకావృత్తివలన జీవనము, పశువులు, వ్యవసాయము, దీర్ఘవిచారము, మరణము, రోగము, చర్మము, విరోధము, అజీర్ణము, కృషిజీవనము, కష్టములు, కఠిన చిత్తము మొదలగువాటికి కారకుడు.

రాహువు:- మాతామహులు, విషవైద్యము, ఆరామము, సంచారము, నీచజనసహవాసము మొదలగువాటికి కారకుడు.

కేతువు:- పితామహులు, మోక్షము, గంగాస్నానము, తీర్థయాత్ర, మంత్రశాస్త్రము, చపలత్వము, చంచలత్త్వము, బ్రహ్మవిద్య, విచిత్ర వస్తుసంపాదన మొదలగువాటికి కారకుడు.

## ద్వాదశ భావములు

1. లగ్నము:- జాతకమునందు పండ్రెండుభావము లన బడు, పండ్రెండు భాగములు కలవు. అది లగ్నముమొదలు చూచుకొనవలయును. జాతకునకు శరీరమెట్టిదో లగ్నము అట్టిది. అందువలననే లగ్నమునకు తనుభావమనిపేరు. లగ్నాధిపతికి ద్వాదశభావ లక్షణములును కలవు. అందుచే ఏభావమును విచారించినను లగ్నాధిపతినిగూడ నా భావాధి పతితో సమానమగు ప్రాముఖ్యతతో చూడవలయును.

సప్తమస్థానమునుబట్టి కొందరు చూచెదరు. లగ్నమును, లగ్నాధిపతినిబట్టి అంగసౌష్ఠవము, ఆయుర్దాయమును తెలుసుకొనవలయును. రూపమునుకూడ లగ్నమునుబట్టియే చూడవలయును. లగ్నచతుర్థాధిపతు లిద్దరిలో ముఖ్యముగ చతుర్థాధిపతినిబట్టి ప్రవర్తనను తెలుసుకొనవలయును.

2. ద్వితీయము:- ధనము, వాక్కు, కుటుంబము, నేత్రములు, మృదువచనము, ఇతరులకు సహాయముచేయుట మొదలగు విషయములు ద్వితీయస్థానమునుబట్టి తెలుసుకొనవలయును.

3. తృతీయము:- సహోదరులు, సాహసము, సేవకులు, మిత్రులు మొదలగునవి తృతీయస్థానమునుబట్టి గ్రహించవలయును. తృతీయమునకు విక్రయస్థానమని పేరుకూడ కలదు.

4. చతుర్థము:- మాతృ, విద్య, భూమి, గృహము, వాహనము, స్వభావము, సౌఖ్యము మున్నగువాటికి సంబంధించిన విషయములనన్నిటిని చతుర్థమునుబట్టి నెరుంగవలయును.

5. పంచమము:- సంతానము, బుద్ధిబలము, వేదాంతము, పాండిత్యము, స్నేహము, వివేకము, యోగము వీటికి సంబంధించిన విషయములను చూడవలయును.

6. షష్ఠము:- రోగము, ఋణము, శత్రువులు, కలహము, అపకీర్తి, విచారము, స్ఫోటకము, మొదలగువానిని తెలియ జేయును.

7. సప్తమము:- వివాహము, కళత్రము, దాసము, భోగము, శృంగారము, అలంకారము, వాణిజ్యము, విజయ స్థానము, గాన, నృత్యవిద్యలు.

8. అష్టమము:- ఆయుర్దాయము, మృతధనము, రాజ దండన, కళత్రపీడ, ఉగ్రదుఃఖము, అకస్మాత్మరణము, ధన నష్టము, కలహము, శిరచ్ఛేదము, ఋణము, పరాభవము, ఆపద మొదలగు విషయములు తెలుసుకొనవలయును.

9. నవమము:- పితృ, దాన, ధర్మ, తీర్థయాత్ర, గజ తురగాది వాహనసౌఖ్యము, బ్రహ్మజ్ఞానము, వైదికము, సంపద, దైవభక్తి, తపస్సు, ఉపాసన, వ్యవసాయము, పట్టాభి షేకము మొదలగు విషయములు తెలుసుకొనవలయును.

10. దశమము:- కర్మ, వృత్తి, ఉద్యోగము, వ్యాపారము, కీర్తి, అధికారము, రాజకీయ పరిజ్ఞానము, తీర్థయాత్ర మొదలగు విషయముల నెరుంగవలయును.

11. ఏకాదశము:- లాభము, జ్యేష్ఠసహోదరులు, ధనార్జన, అలంకారప్రీతి, వ్యవహారనైపుణ్యము, దురాశ,

ఆయుర్దాయము, కళలయందుగల నైపుణ్యము మొదలగు విషయములు తెలుసుకొనవలయును.

12. ద్వాదశము:- వ్యయము, మోక్షము, శత్రుభయములు, మనోవిచారములు, కళత్రనష్టము, అన్యదేశసంచారము, కారాగృహము, ధననష్టము మొదలగు విషయములు తెలుసుకొనవలయును.

## ద్వాదశ రాశుల వర్ణములు

| | |
|---|---|
| మేషము, ధనుస్సు, సింహములు | - ఎఱుపురంగు |
| మకరము, కన్య, మిథునములు | - నలుపురంగు |
| వృషభము, తుల, కర్కాటకములు | - తెలుపురంగు |
| వృశ్చిక, కుంభ, మీనములు | - పసుపురంగు |

## గ్రహములకు వాత, పిత్త, శ్లేష్మ, ఆధిపత్య వివరము

రవి కుజులు పైత్యమును, శుక్ర చంద్రులు శ్లేష్మమును, రాహు శనులు వాతమును, బుధ గురులు సమధాతువును నిరూపింతురు.



****

గణిత మెళ్ళకువల పుస్తకము



## గ్రహములకు ఉచ్చ నీచరాశులు

| గ్రహము | ఉచ్చరాశి | నీచరాశి |
|---|---|---|
| 1. రవి | మేషము | తుల |
| 2. చంద్రుడు | వృషభము | వృశ్చికము |
| 3. కుజుడు | మకరము | కర్కాటకము |
| 4. బుధుడు | కన్య | మీనము |
| 5. గురుడు | కర్కాటకము | మకరము |
| 6. శుక్రుడు | మీనము | కన్య |
| 7. శని | తుల | మేషము |

ఏగ్రహమునకు ఏరాశి ఉచ్చస్థానమని చెప్పబడినదో ఆ రాశికి ఏడవ రాశి నీచరాశి యగును.

రాహువునకు కన్య స్వక్షేత్రము; వృషభము ఉచ్చ: మరియు రాహువునకు సింహము మూలత్రికోణము; కేతువునకు మీనము స్వక్షేత్రము; వృశ్చికరాశి ఉచ్చస్థానము; కుంభము మూలత్రికోణము.

## గ్రహముల శుభత్వ పాపత్వ వివరణ

గురుడు - పూర్ణశుభుడు
శుక్రుడు - త్రిపాదసౌమ్యుడు
బుధుడు - అర్ధసౌమ్యుడు

శని - పూర్ణక్రూరుడు
రాహువు - పూర్ణక్రూరుడు
కేతువు - పూర్ణక్రూరుడు

| | |
|---|---|
| పూర్ణచంద్రుడు - పూర్ణశుభుడు | కుజుడు - త్రిపాదక్రూరుడు |
| సమచంద్రుడు - అర్ధసౌమ్యుడు | రవి - అర్ధక్రూరుడు. |
| క్షీణచంద్రుడు - పాదసౌమ్యుడు | |

## ఓజయుగ్మరాసులు

ఓజయనగా బేసిసంఖ్యరాసులు; యుగ్మమనగా సరిసంఖ్య రాసులు.

1. మేష, మిథున, సింహ, తుల, ధనుస్సు, కుంభములు ఓజరాసులు అనగా విషమరాసులు.

2. వృషభము, కర్కాటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనము - యివి యుగ్మరాసులు అనగా సమరాసులు.

## గ్రహముల గుణములు

| | |
|---|---|
| రవి, చంద్ర, గురులు | - సత్వగుణమునకు కారకులు |
| బుధ, శుక్రులు | - రజోగుణమునకు కారకులు |
| కుజ, శనులు | - తమోగుణమునకు కారకులు |
| రాహువు | - తమోగుణము కలవాడు |
| కేతువు | - సత్వగుణము |

దీని ఉపయోగమేమనగా జాతకములో బలవద్గ్రహము యొక్క గుణము జాతకునకు కలుగును. ఇందుకు శ్రీ దేవకీర్తి శ్లో. "బలవద్భిస్తద్గుణో భవేజ్జాతః" అని చెప్పెను.

## రాసుల కులములు

1. మేషము, ధనుస్సు, సింహము - క్షత్రియజాతి
2. కర్కాటకము, వృశ్చికము, మీనము - బ్రాహ్మణజాతి
3. మిథునము, తుల, కుంభము - వైశ్యజాతి
4. కన్య, వృషభము, మకరము - శూద్రజాతి

## గ్రహములకు మిత్ర, శత్రు, సమ, విషమరాసులు

1. రవికి:- కర్కాటకము, మీనములు మిత్రక్షేత్రములు; వృషభ, తులా, కుంభములు శత్రుక్షేత్రములు; మిథున, కన్యలు సమక్షేత్రములు; వృశ్చిక, ధనుస్సు, మకరములు విషమరాసులు.

2. చంద్రునకు:- మిథున, కన్యా, సింహములు మిత్రరాసులు, మిగిలినవి సమరాసులు.

3. కుజునకు:- కర్కాటక, సింహ, మీన, ధనుస్సులు మిత్రక్షేత్రములు; వృషభ, మిథున, కన్య తుల, మకర కుంభములు శత్రుక్షేత్రములు; సమక్షేత్రములు లేవు.

4. బుధునకు:- వృషభ, సింహ, తులలు మిత్ర క్షేత్రములు; కర్కాటకము శత్రువిషమము; మిగిలినవి సమరాసులు.

5. గురునకు:- మేష, కర్కాటక, సింహ, వృశ్చికములు మిత్రక్షేత్రములు; వృషభ, మిథునములు శత్రుక్షేత్రములు; కుంభము సమక్షేత్రము; విషమక్షేత్రములు లేవు.

6. శుక్రునకు:- మిథున, మకర, కుంభములు మిత్రక్షేత్రములు; కర్కాటక, సింహములు, శత్రుక్షేత్రములు; మీనము ఉచ్చరాశి; సమవిషమములు లేవు.

7. శనికి:- వృషభ, మిథున, కన్యా, తులలు మిత్రక్షేత్రములు, మేష, కర్కాటక, సింహ, వృశ్చికములు శత్రుక్షేత్రములు, ధనుర్మీనములు సమక్షేత్రములు.

8. రాహువునకు:- మేషము మిత్రక్షేత్రము.

9. కేతువునకు:- తుల మిత్రక్షేత్రము.

## తారాబలమును తెలుసుకొను విధానము

శ్లో. జన్మనక్షత్ర మారభ్య నిత్యనక్షత్ర గణ్యతే,
నవసంఖ్యా హరద్భాగం నవతారా ప్రకీర్తితాః.

తా. జన్మనక్షత్రము మొదలు తారాబలము కావలసిన దినముయొక్క నక్షత్రమువరకు లెక్కపెట్టి, వచ్చిన సంఖ్యను 9 చే భాగించవలయును. ఆవిధముగా భాగింపగా మిగిలిన శేషసంఖ్యలు యీ దిగువ తెలుపబడిన జన్మతార మొదలు, తొమ్మిది తారలుగ గ్రహింపవలయును. జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రమునుబట్టి చూడవలయును.

## తారలు

శ్లో. జన్మ సంపద్విపత్ క్షేమ ప్రత్యక్సా ధననైధనం,
మిత్రం పరమమైత్రం చ నవతారాః ప్రకీర్తితాః.

తా. పైన చెప్పబడిన విధముగ జన్మనక్షత్రము లేక నామనక్షత్రము మొదలు నిత్యనక్షత్రముపరకు లెక్కపెట్టి, ఆ సంఖ్యను తొమ్మిదిచే భాగింపగా 1 మిగిలిన జన్మతార, 2 మిగిలిన సంపత్తార, 3 మిగిలిన విపత్తార, 4 మిగిలిన క్షేమతార, 5 మిగిలిన ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధన తార, 8 మిత్రతార, 9 పరమమైత్రతార. ఈ తారలలో 1, 3, 5, 7, తారలు అశుభఫలితములను; 2, 4, 6, 8, 9 తారలు శుభఫలితములను కలుగజేయును. పరమమైత్రతార మధ్యమ ఫలము నిచ్చునని కొందరు వ్రాసియున్నారు. కాని పరమ మైత్రతారకూడ శుభఫలితములనే యిచ్చునని నా అభిప్రాయము.

## తారల శుభాశుభ ఫలనిరూపణ

శ్లో. జన్మభం దేహనాశాయ సంపత్సంపద మేవచ,
విపత్సు కార్యనాశాయ క్షేమమ్ క్షేమకరో భవేత్,
ప్రత్యక్కార్య వినాశాయ సాధన కార్యసాధనే,
నైధనం సర్వసంహైవ మిత్రేచ సుఖసంపదాః,
పరమమైత్రేర్థలాభం స్యాన్నవతారాః ఫలంక్రమాత్.

తా. జన్మతార దేహనాశనమును, సంపత్తార సంపదయు, విపత్తార కష్టములును, క్షేమతార క్షేమమును, ప్రత్యక్తార కార్యనాశనమును, సాధనతార కార్యసాధనయు, నైధనతార ధననష్టమును, మిత్రతార సుఖసంపదలను, పరమమైత్రతార ధనలాభమును కలుగజేయును.

## తారల కధిపతులు

శ్లో. జన్మస్యర్కో హిమకరసుత స్సింహికేయ స్సురేజ్యః
కేతు శ్చంద్రో దినకరసుతో భార్గవో భూమిపుత్రః,
తాపం లాభం క్షితిధృతిలయాన్కీర్తిహాని ప్రమోదా,
న్మృత్యుం తారాబల మనుదినంతే దిశంతి క్రమేణః.

తా. 1. జన్మతారకు సూర్యుడధిపతియగుటవలన తాపమును, 2. సంపత్తారకు బుధు దధిపతియగుటవలన ధనలాభమును, 3. విపత్తారకు రాహు వధిపతియగుటవలన నాశనమును, 4. క్షేమత్తారకు గురు డధిపతియగుటవలన ధైర్యమును, 5. ప్రత్యక్తారకు కేతు వధిపతియగుటవలన మరణమును, 6. సాధనతారకు చంద్రు డధిపతియగుటవలన కీర్తియు, 7. నైధన తారకు శని యధిపతియగుటవలన నష్టమును, 8. మిత్రతారకు శుక్రు డధిపతియగుటవలన సుఖమును, 9. పరమమైత్రతారకు కుజు డధిపతియగుటవలన మరణమును కలుగజేయునని మహర్షులు తెలిపియున్నారు.

## తారల వాహనములు

శ్లో. మయూర హయ మేషాశ్చ గజ వాయి సజంబుకాః,
మృగేంద్రో వైనతేయశ్చ హంస్యాసు ర్షన్మబాదిషు.

తా. జన్మతారకు నెమలియు, సంపత్తారకు అశ్వమును, విపత్తారకు మేకయు, క్షేమత్తారకు ఏనుగును, ప్రత్య క్తారకు కాకియు, సాధనతారకు నక్కయు, నైధనతారకు సింహమును, మిత్రతారకు గరుత్మంతుడును, పరమమైత్రతారకు హంసయు అధిపతులు.

## తారావాహన ఫలములు

నెమలి మనస్తాపమును, అశ్వము సంపదను, మేక కలహమును, ఏనుగు రాజ్యప్రాప్తిని, కాకి కార్య నాశనమును, నక్క సుఖమును, సింహము యుద్ధభయమును, గరుత్మంతుడు విశేష సౌఖ్యంబును, హంస కార్యహానియు కలుగజేయును.

## అశుభతారలకు దానములు

జన్మ, విపత్, ప్రత్య క్తార, నైధనతారలు అశుభ ఫలితములను కలుగజేయును. అట్టి దోషతారలకు దోషపరిహారార్థమై బ్రాహ్మణులకు యీక్రింద తెలుపిన విధముగ దానములనిచ్చి శుభకార్యములు మొదలగునవి జరుపవచ్చునని ఆర్యులు తెలిపియున్నారు.

జన్మతారకు తోటకూరయు, విపత్తారకు బెల్లమును, ప్రత్యక్తారకు ఉప్పును, నైధనతారకు తిలసహితముగ బంగారమును బ్రాహ్మణునకు దాన మీయవలయును.

## తారలకు దోషఘడియలు

జన్మతారకు 7 ఘడియలును, విపత్తారకు 3 ఘడియలును, ప్రత్యక్తారకు 8 ఘడియలును, నైధనతారకు 8 ఘడియలును విడచి శుభాదికార్యములు చేయవలయును.

మరియు ప్రథమనవకములో 1 జన్మతారయు, ద్వితీయ నవకములో 3 విపత్తారయు, తృతీయనవకములో 5 ప్రత్యక్తారయు దోషములు కనుక వీటిని తప్పక విడువవలయును. 7 నైధనతారను సర్వకాలములందును వర్జింపవలయును.

## గ్రంథాంతరమున అశుభ తారలకు దోషఘడియలు

జన్మతార .......... తృతీయపాదము
విపత్తార .......... ప్రథమపాదము
ప్రత్యక్తార ......... నాలుగవపాదము
నైధనతార .......... రెండవపాదము

చంద్రుడు వృషభ కర్కాటకములయం దున్నప్పుడు విపత్తారయు, ప్రత్య క్తారయు శుభము కలుగజేయునని మతాంతరము.

## గోచారమును చూడవలసిన విధానము

జననకాలమునుబట్టి వేయబడిన రాశిచక్రములో చంద్రు డుండు రాశి లగాయితు లెక్కపెట్టగా ఏయే గ్రహములు ఏయే రాశులయందుండునో అనగా చంద్రు డుండురాశి లగాయితు ఏయే స్థానములలో ఏయే గ్రహములుండునో చూచుకొని, ఆయాస్థానములలో ఆయాగ్రహము లున్నప్పుడు యికముందు తెలుపబోవు విధానములనుబట్టి ఫలితములను చూచుకొనవలయును.

ఈ గ్రంధమున కంతటికిని యీ పైవిషయము చాల ముఖ్యమైనది గనుక బాగుగ గ్రహించవలయును.

రవి కుజులు తామున్న రాశి ప్రవేశమైన ప్రథమ ఖండమునందును, గురు శుక్రులు తామున్న రాశికాలము యొక్క మధ్యఖండమునందును రాహు కేతువులు అంత్య ఖండమునందును ఫలితముల నిచ్చుచుందురు.

## గోచార బలాధిక్యము

బ్రాహ్మణులకు గురుబలమును, క్షత్రియులకు రవికుజుల బలమును, వైశ్యులకు చంద్రబలమును, శూద్రులకు శనిబల మును, స్త్రీలకు శుక్రబలమును, జారస్త్రీలకు కేతుబలమును, చోరులకు రాహుబలమును వివాహ సమయములందువలె ముఖ్యముగ విచారింపవలయును.

## చంద్రబలము తెలుసుకొను విధానము

జననకాలముబట్టి వేయబడిన రాశిలో చంద్రుడు ఏ రాశి యందుండునో ఆ రాశి లగాయితుగాని నామనక్షత్రమును బట్టి వచ్చు రాశి లగాయితుగాని చంద్రుడు 1-3. 6-7. 10-11 స్థానముల యందున్న శుభమును కలుగజేయును. 2, 5, 9 స్థానములయందున్న శుక్లపక్ష చంద్రుడును 4-8-12 స్థానములయందున్న బహుళపక్ష చంద్రుడును బిడ్డలను తల్లి రక్షించునట్లు రక్షించును.

## చంద్రుని పూర్ణ మధ్యమ క్షీణత్వముల వివరము

శు 1 మొదలు శు 5 వరకు క్షీణచంద్రుడు.

శు 6 మొదలు శు 10 వరకు మధ్యమచంద్రుడు.

శు 11 మొదలు శు 15 వరకు పూర్ణచంద్రుడు.

బ 1 మొదలు బ 5 వరకు పూర్ణచంద్రుడు.

బ 6 మొదలు బ 10 వరకు మధ్యమచంద్రుడు.

బ 11 మొదలు బ 30 వరకు క్షీణచంద్రుడు.

## చంద్ర బలాబలములు

శ్లో. మాసేతు శుక్లప్రతిపత్ప్ర వృత్తేః
పూర్వే శశిమధ్య బలో దశహే
శ్రేష్ఠోద్వితీయేల్ప బలస్తృతీయే
సౌమ్యైశ్చ దృష్టోబలవాన్సదైవ.

చంద్రుడు మాసాది శుక్లప్రతిపత్తు మొదలుకొని శుక్లదశమి వరకు పదిదినములు మధ్యమ బలుడనియు, శుక్లదశమి మొదలుకొని కృష్ణపంచమివరకు పదిదినములు పూర్వ బలుడనియు, కృష్ణపంచమి మొదలు అమావాస్యవరకు పదిదినములు హీనబలుడనియు, శుభగ్రహముల సంయోగ వీక్షణములు కలిగియుండినచో ఎప్పుడును పూర్ణబలుడే యనియు తెలుసుకొనవలయును.

## చంద్రబలము

శ్లో. జన్మరాశ్యాది మారభ్య చంద్రాంతం పరిగణ్యతే.
ద్వాదశస్థాన సంఖ్యేన శుభాశుభ వినిర్ణయః.

తా. జన్మరాశి లగాయితు చంద్రుడుండు రాశివరకు లెక్కించిన సంఖ్యచే పన్నెండురాసులయందును సంచరించు నపుడు చంద్రుడు కలుగజేయు శుభాశుభ ఫలితములను తెలుసుకొనవలయును.

మరియు భర్త యుండగా స్త్రీకి ఏవిధముగ స్వతంత్రము లేదో ఆ విధముగనే శుక్లపక్షమునందు వృద్ధిచంద్రుడగుట వలనను, తారకు బలములేనందువలనను శుక్లపక్షమున చంద్ర బలమును, కృష్ణపక్షమున తారాబలమును చూడవలయును.

మరియు పురుషులకు సూర్యబలమును, స్త్రీలకు గురు బలమును, స్త్రీ పురుషులకు తారాబల చంద్రబలములును ముఖ్యములు.

## ప్రతిదినము గోచారము చూచుకొనువిధము

శ్లో. జన్మతార చతుర్గుణ్యం తిథివారేణ సంయుతం,
గ్రహసంఖ్యా హరేద్భాగం శేషం నిత్యగ్రహం భవేత్.

తా. ఏదినమునకు గోచారఫలములు కావలయునో జన్మ లేక నామనక్షత్రము మొదలుకొని ఆ దిననక్షత్రమువరకు లెక్క పెట్టి, ఆ సంఖ్యను నాలుగుచే గుణించవలయును. ఆ సంఖ్యకు ఆ దిన తిథి వార సంఖ్యలను కూడ కలిపి, వచ్చిన మొత్తమును తొమ్మిదిచే భాగింపగా వచ్చు శేషమునుబట్టి యీ క్రిందివిధముగ ఫలితములు తెలుసుకొనవలయును.

శ్లో భాను శ్శోకంచ సంతాపం శశాంకశ్చ శుభావహం
భూసుతో మృత్యుమాప్నోతి బుధః ప్రజ్ఞాప్రజాయతే,
గురుర్విత్తం భృగు స్సౌఖ్యం సూర్యపుత్రో మహాద్భయం
రాహుం శ్శత్రు భయంచైవ కేతుర్మృత్యు భయంస్మృతమ్.

తా. పైన చెప్పబడిన విధముగ గణితముచేసినప్పుడు శేషము 1 మిగిలిన రవి విచారమును, 2 మిగిలిన చంద్రుడు శుభమును, 3 మిగిలిన కుజుడు మరణమును, 4 మిగిలిన బుధుడు ప్రజ్ఞయు, 5 శేషము వచ్చిన గురుడు ధన లాభమును, 6 వచ్చిన శుక్రుడు సౌఖ్యమును, 7 వచ్చిన శని మహాభయమును, 8 వచ్చిన రాహువు శత్రుభయమును, 9 వచ్చిన కేతువు ప్రాణ భయమును కలుగజేయునని తెలుసు కొనవలయును.

## ఇతర గ్రంథములలో దినచర్య తెలుసుకొనుటకు తెలుపబడిన మరియొక విధానము

ఏదినమునకు దినచర్య కావలయునో ఆ దినమున ఏ నక్షత్రమున్నదో ఆ నక్షత్రమును పంచాంగమును చూచి తెలుసుకొనవలయును. దిననక్షత్రము మారగనే దినాధిపతి గూడ మారుచుండును. కనుక దిననక్షత్రమును మొదట బాగుగ గుర్తించవలయును. జన్మ లేక నామనక్షత్రమునకు ఎదురుగను, దిన నక్షత్రమునకు దిగువను యున్న యీ క్రింద చూపబడిన పట్టికయందు దినాధిపతిని తెలుసుకొని, పిమ్మట ఆ దినాధిపతికి తెలుపబడిన ఫలితములు తెలుసు కొనవలయును.

| జన్మ లేక నామనక్షత్రము | అశ్విని మఖ మూల | భరణి పుబ్బ పూ-షా | కృత్తిక ఉత్తర ఉ-షా | రోహిణి ఉత్తర శ్రవణము | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పున విశాఖ పూ-భా | పుష్య అనూ ఉ-భా | ఆశ్రే జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని మఖ మూల | శని | గురు | కుజ | రవి | రాహు | శుక్ర | బుధ | చంద్ర | కేతు |
| భరణి పుబ్బ పూ-షా | కేతు | శని | గురు | కుజ | రవి | రాహు | శుక్ర | బుధ | చంద్ర |
| కృత్తిక ఉత్తర ఉ-షా | చంద్ర | కేతు | శని | గురు | కుజ | రవి | రాహు | శుక్ర | బుధ |
| రోహిణి హస్త శ్రవణము | బుధ | చంద్ర | కేతు | శని | గురు | కుజ | రవి | రాహు | శుక్ర |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మృగశిర చిత్త ధనిష్ఠ | శుక్ర | బుధ | చంద్ర | కేతు | శని | గురు | కుజ | రవి | రాహు |
| ఆర్ద్ర స్వాతి శతభిషము | రాహు | శుక్ర | బుధ | చంద్ర | కేతు | శని | గురు | కుజ | రవి |
| పునర్వసు విశాఖ పూ.భాద్ర | రవి | రాహు | శుక్ర | బుధ | చంద్ర | కేతు | శని | గురు | కుజ |
| పుష్యమి అనూరాధ ఉ.భాద్ర | కుజ | రవి | రాహు | శుక్ర | బుధ | చంద్ర | కేతు | శని | గురు |
| ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | గురు | కుజ | రవి | రాహు | శుక్ర | బుధ | చంద్ర | కేతు | శని |

## దినచర్యాధిపతుల ఫలితములు

1. రవిఫలము:- మనోచాంచల్యము, సాహసము, ధన వ్యయము, ఉష్ణము, సంచారము, కార్యాలస్యము, రాజకీయ వ్యవహారములు, నూతనవార్తాశ్రవణము, అకాల భోజనము.

2. చంద్రఫలము:- నూతవవస్త్రలాభము, ధనలాభము, స్త్రీసౌఖ్యము, బంధుమిత్రదర్శనము, గౌరవము, మృష్టాన్న భోజనప్రాప్తి, గొప్పవారితో పరిచయము, ఉత్సాహము, శుభ వర్తమానము.

3. కుజఫలము:- ఆకస్మిక అపాయములు, ధనవ్యయము, కలహము, అకాలభోజనము, వ్యవహారపు చిక్కులు, ఇతరుల సహాయముకోరుట, సాహసము మొదలగు ఫలితములు కలుగును.

4. బుధఫలము:- క్రయవిక్రయమూలమున ధనలాభము, శాస్త్రప్రసంగము, యత్నిత కార్యసాఫల్యము, సౌఖ్యము, శుభ వర్తమానము, విద్యావంతులతోపరిచయము, నూతన విషయ ములందు పాల్గొనుట మొదలగు ఫలితములు కలుగును.

5. గురుఫలము:- దైవభక్తి, విద్యాగోష్ఠి, ధనలాభము, బంధుమిత్రదర్శనము, పరోపకారబుద్ధి, సత్ప్రవర్తన, గౌరవము, అధికారము, ప్రయత్నకార్యములయందు జయము కలుగును.

6. శుక్రఫలము:- స్త్రీసౌఖ్యము, వాహనప్రాప్తి, నూతన వస్త్రప్రాప్తి, సంగీతసాహిత్యములకు సంబంధించిన విషయములలో పాల్గొనుట, బంధుమిత్ర దర్శనము, వినోదములు, సద్గ్రంథ పఠనము మొదలగునవి కలుగును.

7. శనిఫలము:- నీచజనసహవాసము, ధనవ్యయము, మలినవస్త్రధారణ, ప్రయత్నకార్యములయందు ఆలస్యము, అనాచారము, త్రిప్పట, మనస్తాపములు కలుగును.

8. రాహుఫలము:- ధనవ్యయము, నీచజనసహవాసము, యత్నితకార్యవిఘ్నము, వ్యవసాయమూలమున ధనలాభము, సంచారము, దురాలోచన, అకాలభోజనము మొదలగు ఫలితములు కలుగును.

9. కేతుఫలము:- విచిత్రవస్తుప్రాప్తి, పురాణశ్రవణము, పుణ్యనదీజలముల స్నానము, చోర భయము, విష జంతు దర్శనము, కార్యాలస్యము, మంచివారితో సహవాసము, నష్టధన లాభము మొదలగు ఫలితములు కలుగును.

## గోచార ఫలితములు తెలుసుకొను విధానము

జన్మనక్షత్రమునుబట్టి జన్మరాశిని తెలుసుకొనవలయును. అనగా ఒకవ్యక్తి పునర్వసు నక్షత్రములో మొదటిపాదము నందు జన్మించె ననుకొనుము. "అశ్వినీ భరణీ కృత్తికాపాదం

మేషం" అను సూత్రముచే పునర్వసు నక్షత్రమునందు మొదటి పాదమునందు జన్మించినవారికి ఏ రాశి అయినదో చూడవలయును. "మృగశిరార్ధం ఆర్ద్రా పునర్వసూస్త్రయో ర్మిథునం" అను సూత్రప్రకారము పునర్వసు మొదటి పాదము మిథునరాశియైనది.

తరువాత పంచాంగము ననుసరించి యేమాసమునకు గోచారఫలములు చూడవలయునో ఆమాసమునందున్న గ్రహ స్థితిని పంచాంగమునుచూచి వ్రాసుకొనవలయును. పిమ్మట మాసఫలములను తెలుసుకొనవలయును గనుక రవి, కుజ, గురు, బుధ, శుక్ర, శని, రాహు, కేతువులనుబట్టి వారివారికి చెప్పబడిన ఫలితములు చూచుకొని సముదాయఫలములు నిర్ణయించుకొనవలయును.

## గ్రహములకు మూర్తులను నిర్ణయించుట

శ్లో. జన్మర్క్ష రాజేశ్చ గ్రహప్రవేశకాలోడు రాశౌ
యదిచారజంచ రుద్రేరసే జన్మని హేమమూర్తి
శ్శుభంక రాజేషు రాజితశ్చ సచాద్రి దిగ్వహ్నిషు
తామ్రమూర్తిః కష్టం గజార్కాబ్ధిషు కౌహితస్య.

తా. రవి మొదలగు నవగ్రహములును ఒకరాశినుండి మరియొకరాశికి మారుచుండునపుడు ఆరాశిని ప్రవేశించు

కాలమునందుగల నిత్యనక్షత్రము ఏదియగునో పంచాంగమును బట్టి తెలుసుకొని, జాతకుని జన్మరాశిలగాయితు నిత్య నక్షత్రరాశి వరకు లెక్కపెట్టగా 1, 6, 11 రాసులలో నొకటియైన సువర్ణమూర్తియనియు; 2, 5, 9 రాసులలో నొకటియైన రజితమూర్తియనియు; 3, 7, 10 రాసులలో నొకటియైన తామ్రమూర్తియనియు; 4, 8, 12 రాసులలో నొకటియైన లోహమూర్తియనియు చెప్పనగును.

గోచారరీత్యా గ్రహములు దుష్టస్థానములయందున్నను సువర్ణమూర్తి, రజితమూర్తులయినచో శుభఫలితములనే కలుగజేయుదురు. తామ్రమూర్తి, లోహమూర్తులైనయెడల శుభస్థానములయందున్నను చెడుఫలితములనే యిచ్చుచుందురు.

## గ్రహబల తారతమ్యము

శ్లో. బుధాత్కుజోఽధికబలీ తాభ్యాం మందో మహాబలీ
తేభ్యో గురుర్బలీ త్రిభ్యః భార్గవన్యాద్బలాధికః,
తేభ్యోధికబలీ చంద్రః తేభ్యో భానుర్బలీ భవేత్
రాహుంస్సర్వాధికబలీః గ్రహసామర్థ్యమీదృశమ్.

తా. బుధునికంటె కుజుడు బలవంతుడు; కుజ బుధులిరువురికంటెను శని బలవంతుడు; శని, కుజ, బుధులు ముగ్గురికంటెను గురుడు బలవంతుడు; శని, కుజ, బుధ, గురులు నలుగురికంటెను శుక్రుడు బలవంతుడు; శని, కుజ,

బుధ, గురు, శుక్రు లయిదుగురుకంటెను చంద్రుడు బలవంతుడు; ఈ ఆరుగురికంటెను రవి బలవంతుడు. వీరందరికంటెను రాహువు బలవంతుడు.

## శని, కుజ, గురుచార ఫలితములు

శ్లో. ద్వాదశాష్టమ జన్మస్థో శ్శనిరంగారకో గురుః
కుర్వంతీ ప్రాణసందేహం స్థానభ్రంశం ధనక్షయమ్.

తా. గోచారమున శని ద్వాదశమందుండిన ప్రాణ సందేహమును, కుజుడు అష్టమందున్న స్థానచలనమును, గురుడు జన్మమందుండిన ధననష్టమును, శరీరశ్రమయు కలుగును.

## సంవత్సరములయొక్క శుభాశుభ ఫలితములను తెలుసుకొను విధానము

శ్లో. ప్రభవా ద్విగుణం కృత్వా త్రిభిర్న్యూనం చ కారయేత్,
సప్తభిస్తు హరేద్భాగం శేషం జ్ఞేయం శుభాశుభమ్.

తా. తన యిష్టసంవత్సరము ప్రభవాదిగ లెక్కింపగా నెన్నవదియగునో, ఆ సంఖ్యను రెండుచే గుణించి, దాని నుండి 3ను తీసివేసి 7చే భాగింపగా మిగులు శేషమును బట్టి యీ క్రిందివిధముగ ఆ సంవత్సరముయొక్క శుభాశుభ ఫలితములను తెలుసుకొనవలయును.

శ్లో. ఏకం చత్వారి దుర్భిక్షం పంచద్వాభ్యాం సుభిక్షకృత్,
త్రిషష్ఠేతు సమం జ్ఞేయం శూన్యపీడా న సంశయః.

తా. పైన చెప్పబడిన విధముగ లెక్కకట్టినప్పుడు 1 గాని 4గాని శేషమువచ్చినచో ఆ సంవత్సరము దుర్భిక్షముగ నుండుననియు 5, 2 శేషమువచ్చినయెడల సుభిక్షముగ నుండుననియు 3, 6 శేషమువచ్చినయెడల సమముగా నుండుననియు; శేషములేనిచో దేశమునకు అనేక కష్టములు సంభవించుననియు తెలుసుకొనవలయును. ఈ విధముగ ప్రభవాది 60 సంవత్సరములకును తెలుసుకొనవచ్చును. ఈ పద్ధతి ప్రభవాది 60 సంవత్సరములయొక్క సుభిక్ష, దుర్భిక్షములను తెలుసుకొనుటకేగాని వ్యక్తిపూర్వకముగ తెలుసుకొనుటకుగాదు.

## రవ్యాదిగ్రహములకు గోచారరీత్యా శుభాశుభస్థానములు

శ్లో.షట్త్రిదశస్థో భానుః షడ్దశ జన్మ త్రిసప్తక శీతాంశుః
ద్వ్యష్ట చతుర్దశ షట్జ్ఞః గురురద్రిద్వి నవపంచమే శుభఫలదః
కవిరగ దశషడ్వర్జః కుజభానుజ రాహుంకేతు ష్షట్త్రిస్థాః
ఏకాదశస్థా స్సర్వే సమతారాః పరమమైత్ర తారాశ్శుభ ఫలదాః

తా. రవి గోచారరీత్యా 3, 6, 10, 11 స్థానములయందు న్నప్పుడు విశేష శుభఫలితముల నిచ్చును; చంద్రుడు 1, 3,

6, 7, 10, 11 స్థానములయందున్నప్పుడు శుభఫలితముల నిచ్చును; కుజుడు 3, 6, 11 స్థానములయందున్నప్పుడును, బుధుడు 2, 4, 6, 8, 10, 11 స్థానములయందున్న ప్పుడును, గురుడు 2, 5, 7, 9, 10 స్థానములయందున్న ప్పుడును, శుక్రుడు 1, 2, 3, 4, 5, 8, 11, 12 స్థానముల యందున్నప్పుడును, శని 3, 6, 11 స్థానముల యందుండు నప్పుడును, రాహు కేతువులు 3, 6, 11 స్థానముల యందుండునపుడును శుభపలితముల నిచ్చుచుందురు.

## అశుభస్థానములు

రవి 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానములయందు
చంద్రుడు 2, 4, 5, 8, 9, 12 "
కుజుడు 1, 2, 4, 5, 7, 8, 9, 10, 12 "
బుధుడు 1, 3, 5, 7, 9, 12 "
గురుడు 1, 3, 4, 6, 8, 10, 12 "
శని 1, 2, 4, 5, 7, 8, 9, 10, 12 "
రాహువు 1, 2, 4, 5, 7, 8, 9, 10, 12 "
కేతువు 1, 2, 4, 5, 7, 8, 9, 10, 12 "
అశుభఫలితముల నిచ్చుచుందురు.

## ఏడున్నరయేండ్ల శని

శని ప్రతిరాశియందును 2 సంవత్సరముల 6 మాసము లుండును. అనగా 30 మాసము లుండును. లగ్నాత్తు ద్వాదశ స్థానమును ప్రవేశించినది లగాయితు లగ్నాత్తు ద్వితీయరాశిని వదలువరకు ఏడున్నరఏండ్లు పట్టును. దీనినే ఏలినాటిశని యందురు. అనగా లగ్నాత్తు ద్వాదశస్థానమున రెండు సంవత్సరముల ఆరుమాసములును, ఆతరువాత శని ప్రవేశించు రాశియగు జన్మమును అనగా చంద్రుడుండు రాశియందు రెండు సంవత్సరముల ఆరుమాసములును, తరువాత ద్వితీయమునందు రెండు సంవత్సరముల ఆరుమాసములును, మొత్తము యీ ఏడు సంవత్సరముల ఆరుమాసములు ఏలినాటిశని యనబడును.

ఈ విధముగ శని చంద్రరాశ్యాత్తు ద్వాదశమందున్నప్పుడు మహానష్టమును, చంద్రరాశియందు అనగా జన్మమందు మహావిపత్తును, ద్వితీయమునకు వచ్చినపుడు ధననష్టమును, విచారమును కలుగును. జన్మకాలమునకు స్వోచ్ఛత్రికోణ, స్వక్షేత్రంబులనున్న మేలుజేయువాడైనను, యీ ఏడు సంవత్సరములును సామాన్యముగనుండును. జన్మకాలము నకు చెడు ఫలితములనిచ్చువాడైనను అనేకవిధముల ధన వ్యయముచేసి శరీరము రోగయుక్తముగ జేయును.

ఏలినాటిశని ప్రవేశకాలములో మంచిఫలితముల నిచ్చినచో అంత్యమందు విశేష కష్టనష్టములపాలుజేయును. ప్రవేశ కాలములో చెడుఫలితములనిచ్చినచో అంత్యమందు మేలు కలుగజేయువాడగును. మొత్తముమీద గోచారరీత్యా శని 1, 2, 12 స్థానములలో సంచరించుకాలమునందు విశేష పాప ఫలితములు కలుగునని చెప్పవలసియున్నది.

## గురుచారమునకు గోచార విశేషఫలనిదర్శనములు

గురుడు గోచారవశంబున జన్మలగ్నమునందు ప్రవేశించి శ్రీరాములవారికిని, నలునకును దేశపరిత్యాగమును కలిగించి అనేక కష్టములపాలు జేసెను. వారు అనేక కష్టము లనుభవించిరి. 3-వ స్థానమునందు ప్రవేశించి దుర్యోధనునకు సమస్త రాజ్యమును, సైన్యమును బోగొట్టి మరణము కలుగజేసెను. 4-వ స్థానమునందు ప్రవేశించి పాండవులకు రాజ్యమును బోగొట్టి, అడవులపాలుజేసి మహా కష్టములను కలుగజేసెను. షష్ఠమస్థానమునందుజేరి బలికి సమస్త రాజ్య మును బోగొట్టి బంధనప్రాప్తి కలుగజేసి కష్టముల పాలు జేసెను. అష్టమస్థానమునకువచ్చి వాలికి మరణమును కలుగజేసెను. దశమస్థానంబునందుజేరి తారకాసురిని మహా రణమునందు జంపించెను. ద్వాదశస్థానమునందు బ్రవేశించి రావణాసురుని పుత్ర, మిత్ర, బంధు, పరివారముతోసహా

సర్వనాశనము గావించెను. మహాసత్వసంపన్నులగువారినే యిట్టి కష్టములపాలుజేయగా గురునకు యిక మనుష్య మాత్రులెంత? అందు గోచారరీత్యా కుజ, గురు, శనులు దుష్టస్థానములను బొందినప్పుడు ఆయాగ్రహంబులకు ప్రీతికరములైన దాన, జప, హోమాదులు చేసినచో శుభ ఫలములు కలుగును.

## రవి చంద్రరాశ్యాత్తు ద్వాదశస్థానములలో సంచరించునపుడు కలుగు ఫలితములు

శ్లో. స్థానభ్రష్టం భయం సంపన్మానభంగం మహద్భయం
శత్రుక్షయం వ్యథాం రోగం దుఃఖం సిద్ధిం ధనాధనే
క్రమేణ జన్మరాశ్యాది కురుతే పద్మబాంధవః.

తా. రవి చంద్రుడున్న రాశియందున్నపుడు స్థానచలనమును, లేదా తరుచు ప్రయాణములను, ద్వితీయమునందు భయమును, తృతీయమున సంపదను, చతుర్థమునందు అగౌరవమును, పంచమమునందు మహాభయమును, షష్ఠస్థానమున శత్రునాశనమును, సప్తమమునందు విచారమును, అష్టమమున రోగమును, నవమమున కష్టములును, దశమమున కార్యజయమును, ఏకాదశస్థానమున ధనలాభమును, ద్వాదశస్థానమున ధనవ్యయమును కలుగజేయును.

### చంద్రుడు జన్మరాశిలగాయితు ద్వాదశస్థానములందు సంచరించునపుడు కలుగు ఫలితములు

శ్లో. అన్నవృద్ధిం ధనక్షీణం ద్రవ్యలాభం మహాద్గదం
కార్యనాశంచ విత్తంచ ద్రవ్యలాభం చ మృత్యు చ
నృపక్రోధం సుఖం లాభం ధనక్షీణంతు చంద్రమాః.

తా. చంద్రుడు జన్మమందున్నచో మృష్టాన్నభోజన ప్రాప్తియు, 2వ స్థానమున ధనవ్యయమును, 3న ధనలాభమును, 4న రోగమును, 5న కార్యహానియు, 6న ధనలాభమును, 7న విశేషధనప్రాప్తియు, 8న మృత్యుభయమును, 9న రాజదండనాది భయములును, 10న సౌఖ్యమును, 11న లాభమును, 12వ స్థానమున ధనవ్యయమును కలుగ జేయును.

### కుజుడు జన్మరాశి లగాయితు ద్వాదశరాసులయందు సంచరించునపుడు కలుగు ఫలితములు

శ్లో. ఖేదం దౌర్భాగ్య సౌభాగ్యే రిపుపీడాం రిపోర్భయం,
అర్థసిద్ధి మనర్థంచ శస్త్రబాధాం ధనక్షయం,
అశోకం చ ధనం క్రూరం క్రమేణ కురుతే కుజః.

తా. కుజుడు జన్మరాశియందు విచారమును, ద్వితీయమున దరిద్రమును, తృతీయమున సర్వభోగములును, చతుర్థమున శత్రుపీడయు, పంచమమున శత్రుమూలమున భయమును, షష్ఠమమున ధనప్రాప్తియు, సప్తమమున కార్య విఘ్నమును, అష్టమమున శస్త్రములవలన బాధయు, నవమమున ద్రవ్యహానియు, దశమమున సంతోషమును, ఏకాదశమున ధనప్రాప్తియు, ద్వాదశమున కష్టములను కలుగజేయును.

బుధుడు జన్మాది ద్వాదశరాసులందు
సంచరించునపుడు కలుగుజేయు ఫలితములు

శ్లో. బంధనం హేమలాభం చ రిపుపీడా రిపుక్షియం
దారిద్య్రం భూషణం లాభం మనస్సిద్ధిం ధనక్షయం,
ప్రమోదం మోదసంహారం బుధః కుర్యాత్క్రమాద్గతః.

తా. బుధుడు జన్మమందు చిక్కులను, 2న సువర్ణా భరణప్రాప్తియు, 3న శత్రుపీడయు, 4న శత్రుజయమును, 5న దరిద్రమును, 6న అలంకారప్రాప్తియు, 7న ధన లాభమును, 8న ఈప్సితార్థములు నెరవేరుటయు, 9న ద్రవ్య నష్టమును, 10న సంతోషమును, 11న ఆనందమును, 12న హానియు కలుగజేయును.

## గురువు జన్మాది ద్వాదశరాసులందు సంచరించునపుడు కలుగు ఫలితములు

శ్లో. దేశత్యాగం విత్తలాభమనర్థం ధననాశనం,
సంపదం క్లేశమారోగ్యం ధనహానిం ధనాగమం,
పీడనం లాభనష్టం చ క్రమేణ కురుతే గురుః.

తా. గురువు 1-వ స్థానమున స్థానచలనమును, 2న ధన లాభమును, 3న కష్టములును, 4న ధననష్టమును, 5న సర్వ సంపదలను, 6న నానావిధవిచారములను, 7న సౌఖ్యమును, 8న ధనవ్యయమును, 9న ధనలాభమును, 10న శ్రమను, 11న లాభమును, 12న నష్టమును కలుగజేయును.

## శుక్రుడు జన్మాది ద్వాదశరాసులందు సంచరించునపుడు కలుగజేయు ఫలితములు

శ్లో. ఆరోగ్యం భూషణం లాభం రతిం చ ప్రియదర్శనం,
మానహానిం మహద్రోగం భూలాభం ధాన్యవర్ధనం,
ప్రమోదంచ ధనంచైవ సంతోషం కురుతే భృగుః.

తా. శుక్రుడు 1-వ స్థానమున శరీరసౌఖ్యమును, 2న భూషణములును, 3న ధనలాభమును, 4న స్త్రీసౌఖ్యమును, 5న బంధుమిత్రదర్శనమును, 6న అపకీర్తియు, 7న రోగభయమును, 8న భూసంపాదనయు, 9న ధాన్య

వృద్ధియు, 10న సంతోషమును, 11న ధనలాభమును, 12న ఉత్సాహమును కలుగజేయువాడగును.

శని జన్మాది ద్వాదశరాసులందు సంచరించునపుడు
కలుగు ఫలితములు

శ్లో. విపత్తిహానిం సంపత్తిం కుక్షిరోగం సుతక్షయం,
లక్ష్మీకరం మహాద్దైన్యం మరణం దేహశోషణం,
బంధనం లాభనష్టం చ క్రమేణ కురుతే శనిః.

తా. శని జన్మమున అనగా 1-వ స్థానమున విపత్తును, 2న హానియు, 3న ధనలాభమును, 4న ఉదరసంబంధమగు రోగములును, 5న సంతానసష్టమును, 6న విశేషధన ప్రాప్తియు, 7న మహావిచారమును, 8న మరణమును, 9న రోగమును, 10న రాజకీయవ్యవహారపు చిక్కులును, 11న విశేషధన లాభమును, 12న ధననష్టమును, స్థానచలనమును కలుగ జేయును.

రాహుకేతువులు జన్మాది ద్వాదశరాసులందు
సంచరించునపుడు కలుగజేయు ఫలితములు

శ్లో. రాహుర్జన్మగతో భయం చ కలహం సౌభాగ్యమానక్షయే
విత్తభ్రంశ మహత్సుఖే రిపుభయం చాష్టౌ చ చోరాద్భయం,

శత్రోర్వృద్ధి ధనక్షయం శుభఫలం భృత్యస్య నాశం వ్యయే
కుర్యాత్తత్ఫలమేవ కేతునిరశం చేత్యాహు గార్గ్యాదయః.

తా. రాహువుగాని కేతువుగాని జన్మరాశియందున్నచో భయమును, ద్వితీయమున అకారణకలహములును, తృతీయమున సర్వసంపదలును, చతుర్థమున గౌరవనష్టమును, పంచమమున ధనవ్యయమును, షష్ఠమున సౌఖ్యజీవితమును, సప్తమమున శత్రువృద్ధియు, అష్టమమున చోరమూలమున ధననష్టమును, నవమమున శత్రువృద్ధియు, దశమమున ధనవ్యయమును, ఏకాదశమున విశేషధనలాభమును, ద్వాదశమున కష్టములను కలుగజేయుదురు.

G M. RK

## రవి ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు

శ్లో. దేహార్తిశ్చిత్త సంతాపః కాలాతిక్రమ భోజనం,
బంధుమిత్ర సుహృద్ద్వేషః చంద్రరాశిగతే రవౌ.

తా. రవిచంద్రుడున్నరాశిని పొందియుండినచో శరీరమున రోగమును, మనోవిచారమును, అకాలభోజనమును, బంధుమిత్ర పరివారముతో కలహమును సంభవించును.

శ్లో. హీనత్వం దుష్టసంసర్గో మనస్తాప శ్శిరోవ్యథా
నిష్ఫలం కృషివాణిజ్యం విత్తరాశిగతే రవౌ.

తా. రవి ధనస్థానమును ప్రవేశించినచో దరిద్రమును, దుష్టసహవాసమును, మనస్తాపమును, శిరోవ్యాధియు, వ్యాపారమునందుగాని, వ్యవసాయమునందుగాని ధననష్టము కలుగుటయు, చేయువృత్తియందు ధననష్టము మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. ఆరోగ్యం నిత్యసంతోషః బంధుమిత్ర సమాగమః,
అర్థలాభం పుత్రసౌఖ్య మిష్టసిద్ధి స్తృతీయగే.

తా. రవి తృతీయరాశియందున్నప్పుడు ఆరోగ్యమును, ఉత్సాహమును, బంధుమిత్ర దర్శనమును, ధనప్రాప్తియు, సంతానమూలమున సౌఖ్యమును, ప్రయత్నకార్యములయందు జయమును కలుగును.

శ్లో. అంతఃక్లేశం గృహచ్ఛిద్రం సౌఖ్యహాని మభోజనం,
ప్రయాణే విఘ్నమాప్నోతి చతుర్థే రవి సంయుతే.

రవి చంద్రుడున్నరాశి లగాయితు నాల్గవరాశియందు ప్రవేశించినచో మనోవిచారమును, కుటుంబకలహములును, కష్టములును, ప్రయత్నకార్యవిఘ్నమును, మార్గమధ్యమున ప్రయాణమునకు ఆటంకములు కలుగుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. దేహాలస్యం మనస్తాపం సుహృత్క్లేశం ధనవ్యయం,
బుద్ధిచాంచల్యమాప్నోతి పంచమే రవిసంయుతే.

తా. రవి పంచమరాశియందున్నచో దేహజాడ్యంబును, మనోవిచారమును, బంధుమిత్రాదులవలన ధనవ్యయమును, చంచలబుద్ధియు మొదలగు ఫలితములు కలుగును,

శ్లో. షష్ఠే రవౌ సుసౌఖ్యాదీన్ యత్నకార్యార్థ సాధనం,
దేహారోగ్యాది సంతోషం వస్త్రధాన్యాది లాభకృత్.

తా. రవి షష్ఠస్థానమునందున్నచో శరీరసౌఖ్యమును, ప్రయత్నకార్యములయందు జయమును, ఆరోగ్యమును, ఉత్సాహమును, నూతనవస్త్ర ప్రాప్తియు, ధన ధాన్య సమృద్ధియు మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. సామంతజన విద్వేషః దారాపీడా సుతామయం,
ఉత్సాహభంగ కార్యాణి గోచారే సప్తమే రవౌ.

తా. రవి ఏడవరాశియందున్నప్పుడు బంధుమిత్ర పరివారాది సమస్తజనవిరోధమును, కళత్రమునకును, సంతానమునకును శరీరపీడయు, ఉత్సాహభంగమును, ప్రయత్న కార్యములయందు అపజయమును కలుగును.

శ్లో. దుర్ఘోష శ్శత్రుసంవాదో గమనాగమన వ్యధా,
దుఃఖవార్తాశ్రుతం చైవ అష్టమస్థో యదా రవిః.

తా. గోచారరీత్యా రవి అష్టమస్థానమును పొందియున్నచో వివిధరూపముల కష్టములు ప్రాప్తించుటయు, శత్రువృద్ధియు

త్రిప్పటయు, అశుభవర్తమానము మొదలగు చెడు ఫలితములు కలుగును.

శ్లో. నిందాపరాద కలహం నిర్ఘోషశ్చ ధనక్షయః,
పుణ్యలాభార్థనాశశ్చ విచారో నవమే రవౌ.

తా. రవి నవమస్థానమునందున్నచో అపకీర్తియు, కలహమును, వృధాన ధనవ్యయమును, ధననష్టమును మనోవిచారమును కలుగును.

శ్లో. అర్థసిద్ధి స్సదారోగ్యం బంధుమిత్ర సమాగమం,
రాజదర్శన సల్లాపౌ సుసౌఖ్యం దశమే రవౌ.

తా. రవి దశమస్థానమునందు ధనలాభమును, ఆరోగ్యమును, బంధుమిత్రసమాగమమును, రాజకీయ వ్యహారముల యందు జయమును, ప్రభుదర్శనమును, రాజకీయ వ్యవహారములు మాట్లాడుటయు, శరీరసౌఖ్యము మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. అర్థశ్చ స్వకులాచారః గృహే నిత్యోత్సవ శ్శుభం,
నిత్యం మాధుర్య భుక్తిశ్చ లాభే చైకాదశే రవౌ.

తా. రవి గోచారరీత్యా పదునొకండవస్థానమునకు వచ్చినప్పుడు ధనలాభమును, శుభకార్యములు మొదలగునవి జరుగుటయు మధురపదార్థభక్షణము, శరీరసౌఖ్యము మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. స్వస్థాన నాశనం చైవ బంధురోగో ధనవ్యయః,
ప్రాణపర్యంతమాపత్తి రపమానం వ్యయే రవౌ.

తా. రవి ద్వాదశస్థానమునకువచ్చినచో స్థానచలనమును, లేదా తరుచు ప్రయాణములును, ఆప్తబంధువులకు రోగ భయమును, వివిధరూపముల ధనవ్యయమును, విశేష ఆపద లును ప్రాణాపాయమును, అగౌరవమును మొదలగు చెడు ఫలితములు కలుగును. మొత్తముమీద ద్వాదశ స్థానము నందు రవి చెడుఫలితములనే కలుగజేయును.

## చంద్రుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు

శ్లో. శరీరసౌఖ్యమారోగ్యం సంతోషో ధనమున్నతిః,
మృష్టాన్నభోజనం సంగస్సన్మానం జన్మగే విధౌ.

తా. చంద్రుడు జన్మరాశియందున్నప్పుడు శరీరసౌఖ్య మును, ఆరోగ్యమును, సంతోషము, ధనము, ఉత్సాహము, అభివృద్ధియు, మృష్టాన్నభోజనప్రాప్తియు, స్త్రీసౌఖ్యము, సన్మానము మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. అంతఃక్లేశ ధనచ్ఛేద వ్యయద స్సర్వదోషదః,
కుభోజనం దేహజాడ్యం ద్వితీయస్థానగో విధుః.

తా. చంద్రుడు ధనస్థానమునందున్నచో మనోవిచారము, ధనసష్టము, సర్వవిషయములయందును అశుభఫలితములు కలుగుచుండుటయు, రోగమును, కుత్సితాన్నభోజనమును కలుగును.

శ్లో. అర్థలాభో వస్త్రలాభ శ్చిత్తసౌఖ్యం మనోధృతిః,
కాంతాభిరిష్ట సల్లాపః తృతీయస్థానగే విధౌః.

తా. చంద్రుడు తృతీయస్థానమునందున్నచో ధనలాభమును, నూతనవస్త్రలాభమును, ఉల్లాసమును, మనోధైర్యమును, ఇష్టస్త్రీసమాగమంబును మొదలగు శుభ ఫలితములు కలుగును.

శ్లో. చిత్తభ్రంశ బంధువైరం బుద్ధిచాంచల్యమేవ చ,
కర్మ వైకల్య కార్యంచ చతుర్థ స్థానగో విధుః.

తా. చంద్రుడు చతుర్థరాశియందున్నచో, బంధుమిత్ర విరోధమును, హృదయ ఆందోళనయు, ప్రయత్న కార్యములు చెడుటయు మొదలగు అశుభఫలితములు కలుగును.

శ్లో. వాతాధిక్యం సదాలస్యం మనః పీడాం భయం తథా,
ఇష్టార్థనాశం కురుతే పంచమస్థోయదా విధుః.

తా. చంద్రుడు పంచమస్థానమునందున్నచో శరీరమున వాతాధిక్యమును, అనారోగ్యమును, మనోవిచారములును,

ప్రయత్నకార్యములు చెడిపోవుటయు మొదలగు అశుభ ఫలితములు కలుగును.

శ్లో. స్వస్థాన ప్రాప్తి మారోగ్య మర్థలాభం యశో ముదం,
స్త్రీసల్లాపం ధర్మసిద్ధిం షష్ఠగో మృగలాంచనః.

తా. చంద్రుడు షష్ఠమస్థానమునందున్నప్పుడు కుటుంబ జీవితములో సౌఖ్యమును, శరీరఆరోగ్యమును, ధనలాభమును, కీర్తియు, ఆనందమును, స్త్రీసౌఖ్యమును, పరోపకార కార్యములు చేయుటయు మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. మనస్సౌఖ్యం యశోవృద్ధిం సౌభాగ్యం చ ధనాగమం,
స్త్రీసౌఖ్యం దేహసౌఖ్యం చ సప్తమస్థో యదా విధుః.

తా. చంద్రుడు సప్తమరాశిని ప్రవేశించినప్పుడు హృదయానందమును, గౌరవాభివృద్ధియు, సమస్త భోగభాగ్యములు లభించుటయు, ధనాదాయము బాగుగ నుండుటయు, శరీర సౌఖ్యమును, స్త్రీసౌఖ్యమును కలిగి విశేషసౌఖ్యదాయకముగ నుండును.

శ్లో. అజీర్ణామయ సంతాపం జానుబాధాం తథైవచ,
కుభోజనం దేహజాడ్యం పీడా చాష్టమగశ్శశీ.

తా. చంద్రుడు అష్టమస్థానమును ప్రవేశించినప్పుడు అజీర్ణవ్యాధివలన బాధపడుటయు, మోకాళ్లయందు నొప్పు

లును, అకాలభోజనమును, శరీర అనారోగ్యమును, వివిధ రూపముల కష్టములు సంభవించుటయు మొదలగు అశుభ ఫలితములు కలుగును.

శ్లో. వస్త్రనాశం పుత్రవైరం ప్రవాసం వ్యాధిపీడనం,
ఉద్యోగభంగం కలహం నవమస్థో యదా విధుః.

తా. చంద్రుడు నవమమందున్నచో వస్త్రనష్టమును, సంతానముతో విరోధమును, కుటుంబకలహములును, అన్య దేశములయందు నివసించుటయు, అనారోగ్యమును, ఉద్యోగ భంగమును, కలహములును, మొదలైన అశుభఫలితములు కలుగును.

శ్లో. ఇష్టసిద్ధి స్సదారోగ్యం బంధుసంతోష భోజనం,
దశమస్థో యదా చంద్రః యత్న కార్యార్థ సాధనమ్.

తా. చంద్రుడు దశమస్థానము నందున్నచో ప్రయత్న కార్యములయందు జయమును, ఆరోగ్యమును, బంధు ప్రీతియు, ఇష్టకార్యసిద్ధియు కలుగును.

శ్లో. మనస్సౌఖ్యం సదానందః ఇష్టగృహ సుభోజనం,
ధనధాన్యాది లాభస్స్యాత్ చంద్రే చైకాదశం గతే.

తా. చంద్రుడు ఏకాదశస్థానమునందున్నచో మనస్సున సౌఖ్యమును, ఎల్లప్పుడును సంతోషముగా నుండుటయు,

బంధుగృహములయందు సుఖభోజనమును, ధనలాభమును, ధనధాన్య సమృద్ధియు కలుగును.

శ్లో. చిత్తభ్రంశో మానహానిః బంధువైరం ధనక్షయం,
ద్వాదశస్థో యదా చంద్రో దేహాలస్యం మహాద్విపత్.

తా. చంద్రుడు వ్యయస్థానమునందున్నచో హృదయాందోళనయు, అగౌరవమును, బంధుమిత్రవిరోధమును, ధననష్టమును, శరీరశ్రమయు, ఆపదలు సంభవించుటయు మొదలగు అశుభఫలితములు కలుగును.

## కుజుడు ద్వాదశరాశులందును కలుగజేయు ఫలితములు

శ్లో. జ్వరం ఖడ్గవ్రణం చైవ భార్యాబంధు విరోధకృత్,
చంద్రరాశిగతే భౌమే యక్షరాక్షస పీడితమ్.

తా. కుజుడు జన్మరాశియందున్నప్పుడు జర్వము, కత్తి వలన కలిగిన గాయములవలనను, వ్రణములవలనను బాధపడుటయు, బంధువిరోధమును, కుటుంబకలహమును, దుర్మార్గులవలన బాధయు కలుగును.

శ్లో. అసత్వం సతతం క్లేశం సర్వకార్యవినాశనం,
సదా దుర్జన సంపర్కః భీతిస్స్యాద్ధనగే కుజే .

తా. కుజుడు ధనస్థానమునందు శరీరబలహీనతయు, మనోవిచారమును, ప్రయత్నకార్యములు చెడిపోవుటయు, నీచులతో సహవాసమును, భయమును కలుగజేయును.

శ్లో. విత్తలాభ స్సదారోగ్య మిష్టసిద్ధి స్సుఖావహః,
వస్త్రలాభో ధనప్రాప్తి స్తృతీయస్థానగే కుజే.

తా. కుజుడు తృతీయమున ధనలాభమును, ఆరోగ్యమును, ఇష్టకార్యసిద్ధియు, సుఖమును, నూతనవస్త్రప్రాప్తియు కలుగజేయును.

శ్లో. భాగ్యహాని ర్భయం క్రూరం బంధువైరం ధనక్షయం,
రోగపీడాది సంతాపః చతుర్థస్థానగే కుజే.

తా. కుజుడు చతుర్థమున ధనష్టమును, విశేషభయమును, బంధుమిత్రవిరోధమును, రోగమును, విచారమును, శ్రమను కలుగజేయును.

శ్లో. దేహజాడ్యం చ సంతాపః కాలాతిక్రమ భోజనం,
దురితం కర్మలాభశ్చ భౌమే పంచమసంస్థితే.

తా. కుజుడు పంచమస్థానమున రోగమును, విచారమును, అకాలభోజనమును, పాపకార్యములు చేయుటయు మొదలగు ఫలితములు కలుగజేయును.

శ్లో. వస్త్రలాభో ధాన్యలాభో ధనలాభో యశస్తథా,
మనోల్లాసో ధర్మసిద్ధి షష్ఠమస్థే కుజే భవేత్.

తా. కుజుడు షష్ఠమస్థానమునం దున్నప్పుడు నూతన వస్త్రప్రాప్తియు, ధనలాభమును, ధాన్యలాభమును, కీర్తియు, సంతోషమును, పరోపకారకార్యములుచేయుట మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. అన్నవస్త్రాది రాహిత్యం సదా క్లేశ స్స్వబంధుభిః,
కువార్తా పుత్రభ్రాతౄ ణాం క్రోధస్సప్తమగే కుజే.

తా. కుజుడు ఏడవరాశియందు దరిద్రమును, తీరని సంతాపమును, అశుభవర్తమానములును, కుటుంబకలహములు మొదలగు అశుభఫలితములు కలుగజేయును.

శ్లో. ప్రవాసః కార్యహానిస్స్యాత్ కాసరోగ ప్రపీడనం
స్థాననాశ ఋణచ్ఛేద అష్టమస్థే ధరాసుతే.

తా. కుజుడు అష్టమస్థానమునందు దేశసంచారమును; ప్రయత్నకార్యములు చెడిపోవుటయు, కాసరోగమువలన పీడయు, స్థానచలనమును, తరుచు ప్రయాణములును, ఋణమూలమున బాధయు మొదలగు అశుభఫలితములు కలుగును.

శ్లో. అశనాచ్ఛాదనన్యూనం శోషణం దేహపీడనం,
స్థాననాశం విరోధం చ నవమస్థో ధరాసుతః.

తా. కుజుడు తొమ్మిదవరాశియందు దరిద్రమును, శరీరము శుష్కించుటయు, అనారోగ్యమును, విరోధమును, స్థాన చలనమును కలిగించును.

శ్లో. నిత్యం క్లేశస్సదా వ్యాధిస్తథా భోజనదుర్బలం,
సదా సంచార ఉద్యోగం దశమస్థే ధరాసుతే.

తా. కుజుడు దశమస్థానమునందు నిత్యము మనో విచారమును, తరుచు రోగములచే పీడింపబడుటయు, అల్పాహారమును, సంచారమును కలుగజేయును.

శ్లో. ఆరోగ్యమర్థలాభం చ సంతోషం వస్త్రలాభకృత్,
యత్నకార్యానుకూలత్వం ధైర్య మేకాదశే కుజః.

తా.కుజుడు పదునొకండవరాశియందున్నచో ఆరోగ్యమును ధనలాభమును, సంతోషమును, నూతన వస్త్రప్రాప్తియును, ప్రయత్న కార్యములయందు జయమును, ధైర్యమును కలుగ జేయును.

శ్లో. ప్రవాసం వ్యాధిపీడాం చ బంధువైరం ధనక్షయం,
దేహపీడాం చ సంచారం ద్వాదశస్థానగో కుజః.

తా. కుజుడు పంద్రెండవరాశి యందున్నయెడల దేశ సంచారమును, రోగమువలన బాధయు, బంధువిరోధమును, ధననష్టమును, శరీరఆయాసమును, సంచారమును కలుగును.

## బుధుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు

శ్లో. చిత్తభ్రంశో బంధువైరం కాలాతిక్రమ భోజనం,
వివాదో దుష్టసంసర్గ శ్చంద్ర రాశిగతే బుధే.

తా. బుధుడు జన్మరాశిగతుండైనచో మనస్సు చంచలముగ నుండుటయు, బంధువిరోధమును, అకాలభోజనమును, కలహమును, దుష్టసహవాసమును కలుగును.

శ్లో. మణిమూలార్థ లాభం చ సదాసౌఖ్యం నరస్య చ,
నిత్యారోగ్యం చ సద్గోష్ఠి ర్ద్వితీయస్థానగే బుధే.

తా. బుధుడు ధనస్థానమునందు నవరత్న క్రయవిక్రయ మూలమున ధనలాభమును, సర్వత్రా సౌఖ్యముగ నుండుటయు, మంచిఆరోగ్యమును, మంచివారితో పరిచయమును కలుగును.

శ్లో. అర్థహానిర్నృపకోపో జ్ఞాతి వైరం చ విస్మృతిః,
బుద్ధిజాడ్యం మనస్తాపం సహజస్థానగే బుధే.

తా. బుధుడు తృతీయమునందున్నచో ధననష్టమును, రాజదండనాది భయములును, జ్ఞాతులతో విరోధమును, చంచలబుద్ధియు, మనోవిచారము మొదలగు అశుభ ఫలితములు కలుగును.

శ్లో. మాతృసౌఖ్యం చ సంతోషః ధనధాన్య వివర్ధనం,
బుద్ధి ప్రారంభ కార్యస్య సిద్ధి ర్బంధుగతే బుధే.

తా. బుధుడు చతుర్థముననున్నచో మాతృసౌఖ్యమును, సంతోషమును, ధనధాన్యవృద్ధియు, ప్రయత్నకార్యముల యందు జయమును కలుగును.

శ్లో. సర్వాంగేషూష్ణ సంతాప స్సర్వదోషాచ్చ మారణం,
అకస్మాత్కలహశ్చైవ పంచమస్థే బుధే భవేత్.

తా. బుధుడు పంచమస్థానమునందు శరీర అంగములకు సంబంధించిన అనారోగ్యమును, పైత్యవృద్ధియు, అకారణ కలహములును, ప్రాణభయమును కలుగజేయును.

శ్లో. వస్త్రలాభో ధాన్యలాభో మనోధృతిః,
విద్యా వినోద సౌఖ్యం చ రిపుస్థానగతే బుధే.

తా. బుధుడు ఆరవరాశియం దున్నచో నూతనవస్త్ర ప్రాప్తియు, ధనధాన్యసమృద్ధియు, మనోధైర్యము, విద్యా గోష్ఠియు, శాస్త్రగోష్ఠియు, వినోదములు చూచుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. దౌర్భాగ్య మర్థనాశశ్చ ప్రభుక్రోధః కురూపణం,
సర్వాంగజాడ్య ముష్ణం చ సప్తమస్థానగే బుధే.

తా. బుధుడు సప్తమస్థానమునందున్నచో దరిద్రమును, ధననష్టమును, రాజదండనాది భయములును, వికారరూపము పొందుటయు, సర్వాంగములు అనారోగ్యముగను,

బలహీనముగ నుండుటయు, శరీరమునందు తాపమును కలుగునని తెలుసుకొనవలయును.

శ్లో. దేహ జాడ్యం మనస్తాపో వ్యాకులం చాల్పభోజనం,
అనృతం భయమిత్యాహుం రష్టమస్థే భవేద్బుధే.

తా. బుధుడు అష్టమస్థానమునందున్నచో శరీరమునందు రోగమును, మనస్తాపమును, వ్యాకులమును, అల్పభోజనమును, అసత్యప్రవర్తనయు, భయమును కలుగునని తెలుసుకొనవలయును.

శ్లో. దేహాలస్యం యశోహాని స్స్వకర్మ పరపీడనం,
అరోచభోజనం పిత్తం నవమస్తే భవేద్బుధే.

తా. బుధుడు 9వ రాశియందున్నయెడల నిరుత్సాహమును, అపకీర్తియు, పరులకపకారమగు పనులుచేయుటయు, మలినపదార్ధములు భుజించుటయు, పైత్యవృద్ధియు కలుగును.

శ్లో. అపవాదో దూషణంచ అన్నసౌఖ్య నిరాకృతిః,
ఆలస్యం తాపసం చైవ దశమస్థే భవేద్బుధే.

తా. బుధుడు దశమస్థానమునందున్నచో, తిరస్కరింపబడుటయు, కుటుంబచిక్కులును, కార్యాలస్యమును, మనోవిచారమును సంభవించును.

శ్లో. ఆరోగ్య మర్థలాభశ్చ మనః ప్రీతి స్సుఖం భవేత్,
బంధుప్రీతి ర్యశోవృద్ధి ర్లాభే చైకాదశే బుధః.

తా. బుధుడు ఏకాదశస్థానమునందున్నచో ఆరోగ్యమును, ధనలాభమును, ఆనందమును, ఉత్సాహమును, సుఖమును, బంధుసమాగమమును, గౌరవాభివృద్ధియు కలుగునని గ్రహింపవలెను.

శ్లో. సౌఖ్యహాని ర్మనః క్లేశః కృషిభోజన మల్పశః,
నిత్యసంవాద దారిద్ర్యం ద్వాదశస్థానగే బుధే.

తా. బుధుడు ద్వాదశస్థానమునందున్నచో కష్టములును, మనోవిచారములును, చేయువృత్తులయందు చిక్కులు సంభవించుటయు, భోజనసౌఖ్యము లేకపోవుటయు, సదా కలహములును, దరిద్రమును మొదలగు అశుభఫలితములు కలుగును.

## గురుడు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు

శ్లో. రాజకోపో యశోహాని రుద్రోగస్య విరోధకం,
బుద్ధిభ్రంశో భాగ్యహాని ర్భయం తనుగతే గురౌ.

తా. గురుడు జన్మమందుండగా రాజదండనాది భయములును, గౌరవహానియు, చేయువృత్తియందు చిక్కులును, బుద్ధి చాంచల్యమును, ధననష్టమును, ఆపదలును సంభవించును.

శ్లో. మనస్సౌఖ్యం యశోవృద్ధి స్సౌభాగ్యం చ దనాగమః,
ధర్మవ్యయం మనస్సౌఖ్యం ద్వితీయస్థానగే గురౌ.

తా. గురుడు ద్వితీయ రాశియం దున్నప్పుడు మనస్సునకు ఆనందమును, కీర్తియు, ధనలాభమును, సర్వవిషయములయందును శుభఫలితములు కలుగుచుండుటయు, ధర్మకార్యములు చేయుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. అతిక్లేశం బంధువైరం దారిద్ర్యం దేహపీడనం,
ఉద్యోగభంగం కలహం తృతీయస్థానగో గురుః,

తా. గురుడు తృతీయస్థానమును ప్రవేశించిన తరువాత మనోవిచారమును, బంధువిరోధమును, దరిద్రమును, శరీరపీడయు, ఉద్యోగభంగమును, కలహమును, కలుగును.

శ్లో. యాచనం బుద్ధిచాంచల్యం తేజోహానిం ధనవ్యయం,
దేశత్యాగం చ కలహం చతుర్థస్థానగో గురుః.

తా. గురుడు చతుర్థస్థానమునందున్నచో దరిద్రమును, స్థిరములేకపోవుటయు, అపకీర్తియు, ధనవ్యయమును, స్థానచలనమును, కలహమును సంభవించును.

శ్లో. అర్థలాభం తథైశ్వర్యం స్వకర్మ రతిహర్షితం,
సదా స్వజనసౌఖ్యం చ పంచమస్థే భవేద్గురౌ.

తా. గురుడు పంచమరాశియందున్నచో ధనలాభమును, సంపదయు, చేయువృత్తియందు అభివృద్ధియు, కుటుంబ సౌఖ్యమును కలుగును.

శ్లో. దారపుత్ర విరోధశ్చ స్వజనే కలహస్తథా,
చోరాగ్ని నృప భీతిశ్చ షష్ఠమస్థే భవేద్గురౌ.

తా. గురుడు ఆరవరాశియందు దారాపుత్రవిరోధమును, స్వజనులతో కలహించుటయు, చోరులవలనను, అగ్ని వలనను, రాజులవలనను భయమును కలుగజేయును.

శ్లో. రాజదర్శన మారోగ్యం గాంభీర్యం గాత్రపోషణం,
అభీష్టకార్యసిద్ధిశ్చ సప్తమస్థే భవేద్గురౌ.

తా. గురుడు సప్తమస్థానమునందున్నచో రాజకీయ వ్యవహారములలో జయమును, ఆరోగ్యమును, తేజమును, బలమును, అభీష్టకార్యసిద్ధియు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. చోరాగ్ని నృపభీతిశ్చ గాత్ర గాంభీర్య నాశనం,
నిష్ఠురం సాహసం క్రోధమష్టమస్థే గురౌ భవేత్.

తా. గురుడు అష్టమస్థానమునందున్నచో చోరులవలనను, అగ్నిమూలముగను, రాజులవలనను భీతియు, తేజో హీనమును, అధైర్యమును, కఠినముగ మాటలాడుటయు,

కోపమును హద్దుమీరినడచుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. అర్థం చ స్వకులాచారః గృహలాభ స్సుభోజనం,
నిత్య స్త్రీజనసంపర్కః నవమస్థే భవేద్గురౌ.

తా. గురుడు తొమ్మిదవరాశి యందున్నప్పుడు ధన లాభమును, కులాచారములయందు శ్రద్ధయు, గృహ లాభమును, భోజనసౌఖ్యమును, స్త్రీసౌఖ్యమును కలుగును.

శ్లో. ధాన్యనాశో ధనచ్ఛేదః వృధాసంచరణం భయం,
స్వజనై ర్దూషణం చైవ దశమస్థో యదా గురుః.

తా. గురువు దశమస్థానమునందున్నయెడల ధననష్టమును, ధాన్యనష్టమును, వృధాత్రిప్పటయు, భయమును, బంధు జనులను దూషించుట మున్నగు ఫలితములు కలుగును.

శ్లో. యశోవృద్ధి ర్బలం తేజ స్సర్వత్ర విజయస్సుఖమ్,
శత్రునాశో మంత్రసిద్ధి రేకాదశగతే గురౌ.

తా. గురుడు ఏకాదశస్థానము దున్నచో గౌరవాభివృద్ధియు, తేజమును, సర్వకార్యములయందు జయమును, సౌఖ్య జీవితమును, శత్రునాశనమును, మంత్రసిద్ధియు కలుగును.

శ్లో. శుభమూలో వ్యయశ్చైవ ప్రాణివిక్రయ దూషణం,
స్థానభ్రష్టం చ దారిద్ర్యం ద్వాదశస్థానగే గురౌ.

తా. గురుడు ద్వాదశస్థానమునందున్నచో శుభకార్యములు చేయుటవలన ధనవ్యయమును, పశునష్టమును, స్థానచలనమును లేదా తరుచు ప్రయాణములును, దరిద్రమును కలుగును.

## శుక్రుడు ద్వాదశరాసులందు కలుగజేయు ఫలితములు

శ్లో. అర్థలాభ శ్చిత్తసౌఖ్యం పరస్త్రీసంగమస్తథా,
యత్నకార్యార్థ లాభస్స్యాత్ జన్మగే భృగునందనే.

తా. శుక్రుడు జన్మరాశియందున్నచో ధనలాభమును, హృదయానందమును, అన్యస్త్రీ సంపర్క సౌఖ్యమును, ప్రయత్నకార్యములు సానుకూలములగుటయు మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. కుటుంబసౌఖ్య మారోగ్యం స్త్రీసల్లాపం యశస్కరం,
దేహసౌఖ్యం వస్త్రలాభం ద్వితీయస్థో భృగుర్దిశేత్.

తా. శుక్రుడు ద్వితీయ రాశియందుండినచో కుటుంబ జీవితములో సౌఖ్యమును, ఆరోగ్యమును, స్త్రీలతో సల్లాపము లాడుటయు, కీర్తియు, దేహసౌఖ్యమును, వస్త్రలాభమును కలుగును.

శ్లో. వాణిజ్య ధననాశం చ శత్రువృద్ధి నక్షయః,
గతం జీవనరాహిత్యం భార్గవే చ తృతీయగే.

తా. శుక్రుడు తృతీయరాశియందున్నచో, వ్యాపారమూలమున ధననష్టమును, శత్రువృద్ధియు, త్రిప్పటయు, జీవనరాహిత్యమును కలుగజేయును.

శ్లో. స్వబుద్ధి ర్బబంధుసన్మానం స్త్రీసంభాషణ సంభ్రమః,
పుత్ర మిత్ర కళత్రాది విద్యాగోష్ఠి సుఖే భృగుః.

తా. శుక్రుడు చతుర్థస్థానమునందున్నయెడల మంచి ఆలోచనలను, బంధుమిత్రాదులలో గౌరవాభివృద్ధియు, స్త్రీసౌఖ్యమును, పుత్రమిత్రకళత్రాదులతో సౌఖ్యముగ జీవించుటయు, సద్గ్రంథపఠనంబును, విద్వాంసులతో పరిచయమును మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. దాసీ భృత్య జనలాభః నిత్య మృష్టాన్న భోజనం,
ధనధాన్య మభీష్టార్థః పంచమస్థే భవేద్భృగౌ.

తా. శుక్రుడు పంచమ రాశియుందున్నచో సేవకాజన మూలమున సౌఖ్యమును, నిత్యమృష్టాన్న భోజనప్రాప్తియు, ధనధాన్య సమృద్ధియు, ఇష్టకార్యార్థసిద్ధియు కలుగును.

శ్లో. విరోధశ్శ పీడా చ జ్ఞాతీనాం చ విరోధతః,
ఆయాసో దారపుత్రాద్యై షష్ఠగే భృగునందనే.

తా. శుక్రుడు ఆఱవస్థానమునందు విరోధమును, శత్రుపీడయు, జ్ఞాతివిరోధమును, సంతానమువలనను, భార్యవలనను శ్రమను కలుగజేయును.

శ్లో. తాపః కోప స్తదా భీతి స్సర్వదా క్లేశ జీవనం,
స్త్రీజాడ్యం మేహరోగాది భృగౌ సప్తమగే ఫలమ్.

తా. శుక్రుడు సప్తమస్థానమునందున్నచో తాపమును, కోపమును, ఎల్లప్పుడును భీతియు, సదా విచారమును, సుఖరోగములవలన బాధయు, మేహరోగము మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. దుఃఖనాశో మహాసౌఖ్యం బంధుమిత్ర సమాగమః,
రాజదర్శన మర్థాప్తి రష్టమే భృగునందనే.

తా. శుక్రుడు అష్టమస్థానమునందున్నచో కష్టములు తొలగుటయు విశేషసౌఖ్యమును, బంధుమిత్రులతో కలసి సౌఖ్యముగ కాలముగడుపుటయు, ధనలాభమును, రాజ దర్శనమును కలుగును.

శ్లో. వస్త్రలాభో మహారోగ్యం గురుభక్తి స్వధర్మకృత్,
చిత్తశుద్ధి రభీష్టార్థో నవమస్థే భవేద్భృగౌ.

తా. శుక్రుడు నవమస్థానమునందున్నచో నూతనవస్త్ర ప్రాప్తియు, మంచి ఆరోగ్యమును, గురుభక్తియు, స్వకులా చారములను పాటించుటయు, మంచి ప్రవర్తనయు, ప్రయత్న కార్యములయందు జయము మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. వ్యాకులం చైవ నిస్సత్వ మర్థనాశం రిపోర్భయం,
స్త్రీసౌఖ్యహాని మాప్నోతి దశమస్థే భృగోసుతే.

తా. శుక్రుడు దశమస్థానమునందున్నచో విచారమును నిరుత్సాహమును, ధననష్టమును, శత్రుమూలమున భయమును, స్త్రీలకు సంబంధించిన వ్యవహారములలో చిక్కులు మొదలగు అశుభ ఫలితములు కలుగును.

శ్లో. పుష్టిం కాంతిం తథా కీర్తి మిష్టకార్యార్థ సాధకం,
క్షీరాన్నభోజనం కుర్యా చ్ఛుక్ర స్యైకాదశే ఫలమ్.

తా. శుక్రుడు పదునొకండవ స్థానమునందున్నచో శరీర బలమును, కీర్తియు, యత్నితకార్యములయందు జయమును, ధనలాభమును, మధురపదార్థములు భక్షించుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. శస్త్రపీడా చోరబాధా చాతిక్లేశో మహద్భయం,
కృష్యాది సర్వవిఘ్నం స్యా ద్ద్వాదశస్థానగే భృగౌ.

తా. శుక్రుడు ద్వాదశస్థానమునం దున్నప్పుడు శస్త్రముల వలనను, చోరులవలనను బాధయు, వివిధరూపముల కష్టములు ప్రాప్తించుటయు, భయమును, చేయువృత్తియందు ఆటంకములు కలుగుచుండుటయు మొదలగు చెడు ఫలితములు కలుగుచుండును.

## శని ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు

శ్లో. తేజోహానిర్మతి భ్రంశో మనఃపీడా భయం తథా,
రోగార్తి ర్బంధువైరం చ వ్యసనం జన్మగే శనౌ.

తా. శని జన్మరాశియందున్నప్పుడు అపకీర్తియు, చంచలబుద్ధియు, మనోవిచారమును, భయమును, రోగమును, బంధుమిత్ర విరోధమును, దుఃఖమును సంభవించును.

శ్లో. సదాక్లేశం వృధా వైరం సతతం కార్యనాశనం,
సంచార స్స్వజనద్వేషం పాపచింతాం ధనే శనౌ.

తా. శని ద్వితీయరాశియందున్నయెడల, ఎల్లప్పుడును విచారములును, వృధాకలహములును, ప్రయత్నకార్యములు చెడిపోవుచుండుటయు సంచారము, పాపకార్యములు చేయుటయు, సర్వజనవిరోధమును కలుగును.

శ్లో. స్త్రీభోగం చ మనస్సౌఖ్యం బుద్ధియత్నాది సిద్ధికృత్,
స్వస్థాన ప్రాప్తిమారోగ్యం రవిపుత్రే తృతీయగే.

తా. సూర్యునకు కుమారుడైన శని మూడవరాశి యందున్నచో స్త్రీసౌఖ్యమును, సంతోషమును, బుద్ధి బలమును, ప్రయత్న కార్యములయందు జయమును, స్వగ్రామమున సౌఖ్యముగ జీవించుటయు, ఆరోగ్యమును కలుగును.

శ్లో. వాతశూలం మనఃక్లేశం స్వస్థాన హానికృత్,
ప్రసూతి దేహపీడా చ సూర్యపుత్ర శ్చతుర్థగః.

తా. శని అర్ధాష్టమమునందు అనగా చతుర్థమునం దున్నచో శరీరమున వాతరోగములు ప్రవేశించుటయు, మనస్తాపమును, భయమును, స్థానచలనమును, శరీర అనారోగ్యమును, వివిధరూపముల కష్టములు ప్రాప్తించుటయు మొదలగు అశుభ ఫలితములు కలుగుచుండును.

శ్లో. కార్యహాని ర్మనస్తాపః జ్ఞాతివ్యాజ్య కలాపకం,
హీనస్త్రీభోగ సంతాపః పంచమస్థే భవేచ్ఛనౌ.

తా. శని పంచమస్థానమునందున్నచో ప్రయత్నకార్యములు నెరవేరకుండుటయు, మనోవిచారమును, జ్ఞాతులతో వ్యాజ్యములు మొదలగునవి సంభవించుటయు, నీచస్త్రీల పరిచయమువలన కష్టములు సంభవించుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. ధనధాన్యాభివృద్ధిం చ బంధుసంతోష వర్ధనం,
స్త్రీసౌఖ్యం గృహనిర్మాణం షష్ఠస్థానగత శ్శనిః.

తా. శని ఆరవరాశియందు ప్రవేశించినపిదప ధనధాన్య వృద్ధియు, బంధుమిత్ర సమాగమమును, నూతన గృహ నిర్మాణమును, స్త్రీసౌఖ్యమును, సంతోషమును మొదలగు శుభఫలితములు కలిగి విశేష యోగవంతముగ నుండును.

శ్లో. వ్యాధిపీడాం ప్రవాసం చ అంతఃక్లేశం మహద్భయం,
అర్థనాశం మనస్తాపం సప్తమస్థానగ శ్శనిః.

తా. శని గోచారరీత్యా సప్తమస్థానమునం దున్నప్పుడు వ్యాధియు, దూరదేశములకు పోవుటయు, మనోవిచారమును, మహాభయమును, ధననష్టమును, కుటుంబ చిక్కులును మొదలగు చెడుఫలితములు కలుగును.

శ్లో. నానా కార్య విరోధశ్చ వ్యాధిపీడా ధనక్షయః,
అపమృత్యు భయప్రాప్తి రష్టమస్థే శనౌ భవేత్.

తా. శని అష్టమస్థానమునం దున్నచో ప్రయత్నకార్యములు చెడిపోవుటయు, బంధుమిత్ర ప్రజావిరోధమును, రోగమును, ధననష్టమును, ప్రాణభయమును, ఆకస్మిక అపాయములును సంభవించును.

శ్లో. శోకం రోగం మహాదుఃఖం క్వచిద్ద్రవ్యం క్వచిత్సుఖం,
స్వదార స్వసుత క్లేశం నవమస్థో శనిర్దిశేత్.

తా. శని తొమ్మిదవరాశిని చేరియుండినచో విచారమును, రోగమును, వివిధరూపముల కష్టములు ప్రాప్తించుటయు, పాపకార్యములు చేయుటయు, ప్రయత్నకార్యములు చెడి పోవుటయు, చేయువృత్తికి భంగము కలుగుటయు మొదలగు అశుభఫలితములు కలుగుచుండును.

శ్లో. వ్యాకులం శోకసంతాపః పాపముద్యోగ విఘ్నకం,
కృష్యాది సర్వవిఘ్నం చ దశమస్థే భవేచ్ఛనౌ.

తా. శని దశమస్థానమును పొందియున్నచో విచారమును, వివిధరూపముల కష్టములు సంభవించుటయు, పాప కార్యములు చేయుటయు, చేయువృత్తియందు చిక్కులును, సమస్త విషయములందును వ్యతిరేక ఫలితములు కలుగు చుండుట మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. ఆరోగ్య మర్థలాభశ్చ స్త్రీపుత్ర సుఖవర్ధనం,
చిత్తశుద్ధి రభీష్టార్థం ఏకాదశగతే శనౌ.

తా. శని ఏకాదశస్థానమునందు ప్రవేశించినచో ఆరోగ్య మును, ధనలాభమును, సంతానప్రాప్తియు, సంతోషమును, ప్రయత్న కార్యములయందు జయమును కలుగును.

శ్లో. మానహాని ర్మనఃక్లేశం కృషి ర్భోజన మల్పశః,
నిత్యసంవాద దారిద్ర్యం ద్వాదశస్థానగే శనౌ.

తా. శని ద్వాదశరాశియందు ప్రవేశించినచో అపకీర్తియు, మనస్తాపమును, సేవకావృత్తివలన జీవనమును, భోజన సౌఖ్యము లేకపోవుటయు, దరిద్రమును, నిత్యమును కలహ కారణములు కలుగుచుండుటయు, అనారోగ్యము మున్నగు అశుభఫలితములు కలుగుచుండును.

## రాహుకేతువులు ద్వాదశరాశులందు కలుగజేయు ఫలితములు

శ్లో. దారాపుత్ర విరోధం చ ప్రవాసం రోగపీడనం,
అర్థహానిర్మహాకష్టం జన్మస్థానగతో ఫణీ.

తా. రాహువుగాని కేతువుగాని జన్మమునందు ప్రవేశించినచో కుటుంబకలహములును, దేశసంచారమును, రోగమును, ధననష్టమును, నానావిధకష్టములు ప్రాప్తించుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. సౌభాగ్యం భాగ్యమారోగ్యం మర్థలాభం యశస్కరం,
వాక్పౌరుషం వినోదం చ ధనస్థానగతో ఫణీ.

తా. రాహు, కేతువులు ధనస్థానమునందున్నచో సౌభాగ్యమును, వివిధరూపముల ధనలాభమును, శరీరబలమును, కీర్తియు, ప్రజలలో మాటపలుకుబడితనమును, సర్వత్రా అనుకూలముగ నుండుటయు మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. మానహానిర్మనః క్లేశం ధైర్యహానిస్తథైవ చ,
భ్రాతృద్వేషం మహాకష్టం విక్రమస్థో యదాఫణీ.

తా. రాహువుగాని కేతువుగాని తృతీయరాశియందు ప్రవేశించినప్పుడు అపకీర్తియు, మనస్తాపమును,

సహోదరులతో కలహములును, వివిధరూపముల కష్టములు ప్రాప్తించుటయు మొదలగు అశుభఫలితములు కలుగును.

శ్లో. చిత్తభ్రంశం, వాతరోగం స్త్రీమూలాశ్చ భయప్రదం,
గమనే కార్యనాశం చ బంధుస్థానగతో ఫణీ.

తా. రాహువుగాని కేతువుగాని చతుర్థస్థానమునకు వచ్చినప్పుడు అస్థిరబుద్ధియు, శరీరమున వాతాధిక్యమును, స్త్రీమూలక కలహకారణములు కలుగుటయు, ప్రయత్న కార్యములు ఫలించకుండుటయు, ప్రయాణమును కలుగును.

శ్లో. పుత్రవైరం నృపాత్పూజ్యం కాలాతిక్రమ భోజనం,
సుసంవీక్ష్యం నృణాం పూజ్యం పంచమస్థో యదా ఫణీ.

తా. రాహువుగాని కేతువుగాని పంచమమం దున్నచో సంతానముతో విరోధమును, ప్రభుసన్మానమును, వేళ అతిక్రమించి భుజించుచుండుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. ధైర్యబుద్ధి ర్వీర్యవృద్ధిః రిపునాశం సదా శుభం,
గౌర్భూమి శ్శత్రుణా లాభం రిపుస్థానగతో ఫణీ.

తా. రాహుకేతువులు ఆఱవస్థానమునం దున్నచో సాహసమును, సూక్ష్మబుద్ధియు, పరాక్రమమును, శత్రువులు నశించుటయు, సర్వవిషయములందును శుభఫలితములు కలుగు

చుండుటయు, శత్రువులను జయించుటవలన గో, భూలాభమును కలుగును.

శ్లో. సర్వధాన్యఫలం స్వల్పం గమనాగమనం వృథా,
కరపాదాంగుళైకుష్ఠీ జామిత్రే ఫణి సంస్థితే.

తా. రాహు, కేతువులు సప్తమస్థానమునం దున్నప్పుడు చేయుకృషిమూలమున స్వల్పలాభమును, వృధాత్రిప్పటయు, చేతులయొక్కయు, కాళ్ళయొక్కయు వ్రేళ్లకు కుష్ఠువ్యాధి సంభవించుటయు మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. దేహపీడా మనఃక్లేశం చతుష్పాద మృగాద్భయం,
రాజకోపం ప్రయాణం చ అష్టమస్థానగో ఫణీ.

తా. రాహువుగాని కేతువుగాని అష్టమస్థానమునం దున్నప్పుడు శరీరపీడయు, మనోవిచారమును, క్రూర జంతువులవలన భయమును, రాజదండనాది భయములును, తరచు ప్రయాణములును, ప్రయత్నకార్యములు చెడుటయు, ఇత్యాది అశుభఫలితములు కలుగును.

శ్లో. గోవాజిగజనాశం చ ధనధాన్యాది నాశకృత్,
ప్రయాణ క్లేశమాప్నోతి భాగ్యస్థానగతో ఫణీ.

తా. రాహు కేతువులు భాగ్యస్థానమును అనగా నవమ స్థానమును పొందినప్పుడు పశునష్టమును, ధనధాన్య

నష్టమును, త్రిప్పటయు, కార్యవిఘ్నములును కలుగు చుండును.

శ్లో. మనస్సౌఖ్యం సదానందం అభీష్ట సుఖభోజనం,
కర్మసిద్ధి ర్బలంపుష్టిం దశమస్థో యదా ఫణీ.

తా. రాహువుగాని కేతువుగాని దశమస్థానమనం దున్నచో మనస్సునందు సంతోషమును, భోజనసౌఖ్యమును, ఎల్లప్పు డును ఆనందముగ నుండుటయు, శరీరబలమును, కష్టములు తొలగిపోవుటయు మొదలైన శుభములు జరుగును.

శ్లో. గోవాజిగజ సంఘానాం క్షీరాన్నాది సుభోజనం,
వస్త్రమాల్యాది లాభం చ ఏకాదశగతో ఫణీ.

తా. రాహు కేతువులు ఏకాదశస్థానమునం దున్నప్పుడు పశులాభమును, భోజసౌఖ్యమును, నూతనవస్త్రప్రాప్తియు, వస్తుప్రాప్తియు, సుగంధలాభమును కలుగును.

శ్లో. దారిద్ర్యం ధననాశం చ నేత్రపీడా రిపోర్భయం,
కార్యవిఘ్నం ప్రవాసంచ ద్వాదశస్థో యదా ఫణీ.

తా. రాహువుగాని, కేతువుగాని ద్వాదశస్థానమునందు అనగా 12-వ స్థానమునం దున్నచో దరిద్రమును, ధన నష్టమును, కలుగబోవు ధనలాభములకు తరుచు అవాంత రములు కలుగుచుండుటయు, నేత్రరోగమును, శత్రు

మూలమున భయమును, ప్రయత్నకార్యములు చెడిపోవు టయు, తరుచు ప్రయాణములును, స్థానచలనమును కలుగును.

## జన్మలగ్నమును తెలుసుకొను విధానము

జననకాలమునకు సూర్యోదయము లగాయతు ఎన్ని గడియలైనది చూడవలయును. దీనిని యీ కాలములో గడియారము యొక్క సహాయముచే తెలుసుకొనవచ్చును. కనుక పాదచ్ఛాయలచే ప్రొద్దుకట్టు విధానమును యిందు వ్రాయ నక్కరలేదు. ఒకగంట అనగా రెండున్నర గడియలు పంచాంగమునుబట్టి ఏరాశియందున్నాడో చూడవలయును. ఆ రాశియే సూర్యోదయరాశి యనబడును. పంచాంగములో వేసిన భుక్తి అనగా భుక్తిగడియలు సూర్యోదయరాశియొక్క ప్రమాణములో తీసివేసి ఆ రాశిలో మిగిలిన గడియలను తరువాత సూర్యోదయరాశి లగాయితు జననకాలమువరకు నడచిన రాసుల ప్రమాణములను కలిపి మొత్తముమీద జనన కాలమునకు ఏ రాశి వచ్చునో కట్టవలయును. ఆ రాశియే జన్మలగ్న మనబడును.

# రాశి చక్రమునందు గ్రహములు వేయు విధానము

జాతకుడు జన్మించినకాలము పంచాంగములో చూడ వలయును. ఆగడియ లగాయతు జననకాలమునకు పూర్వము అనగా ముందు ఏయేగ్రహములు ఏయే నక్షత్రపాదముల యందున్నవో చూడవలయును. గ్రహములు ప్రతిదినము ఏయే నక్షత్రముల పాదములయందున్నవో ప్రతి పంచాంగము నందును గుర్తింపబడి యుండును. ఆవిధముగ జననకాలమునకు పూర్వము పంచాంగమునుబట్టి గ్రహములు ఏయే నక్షత్రముల పాదముల యందున్నవో చూచుకొని అశ్విని, భరణి, కృత్తిక పాదముల యందున్న గ్రహములు ఏయే రాసులయం దుండునో వేయవలయును. ఈ విధముగ రవ్యాది నవగ్రహములను ఏరాసుల యందుండినవో వేసి, జన్మలగ్నముకూడ ఏర్పరచినచో అది రాశి చక్ర మనబడును.

అంశచక్రములో అశ్విని 1-వ పాదమునందున్న గ్రహ మును మేషమందును, 2-వ పాదమునందున్న గ్రహమును వృషభమందును, 3-వ పాదమునందున్న గ్రహమును మిథున మందును, 4-వ పాదమునందున్న గ్రహమును కర్కాటక మందును, భరణి 1-వ పాదమందున్న సింహమందును, 2-వ పాదమునందున్న కన్యయందును, 3-వ పాదము నందున్న తులయందును, 4వ పాదమునందున్న వృశ్చిక

మందును; కృత్తిక 1-వ పాదమునందున్న ధనుస్సునందును, 2-వ పాదమునందున్న మకరమందును, 3-వ పాదము నందున్న కుంభమందును, 4-వ పాదమందున్న మీన మందును వేయవలయును. ఆ విధముగనే రోహిణి 1, 2, 3, 4 పాదములలో నున్న గ్రహములను క్రమముగ మేష, వృషభ, మిథున, కర్కాటకములలో వేయవలయును. ఈ క్రమముగనే మిగిలిన గ్రహములనుకూడ వేసుకొనవలయును.

## అంశచక్రములో లగ్నము తెలియు విధానము

జన్మగడియలను 9 భాగములుచేసి జన్మకాలఘుడియ లేభాగములో పడునో చూడవలయును. మేషము జన్మలగ్న మైనయెడల మేషము లగాయితు పైనచెప్పినభాగ మెన్నవదిగ నున్నదో అది నవాంశలగ్న మగును.

కొందరు యీవిధానమునే మరియొక విధముగ వేయు చున్నారు. అనగా జన్మలగ్న ప్రమాణమును 9చే భాగించి వచ్చులబ్దముచే జన్మలగ్నభుక్తిని భాగించగావచ్చు లబ్ది సంఖ్య, జన్మలగ్నము మేష, సింహ, ధనుస్సులలో నొకటి జన్మలగ్నమైనప్పుడు, మేషము లగాయితు ఆ సంఖ్యగల రాశి నవాంశ లగ్నమగును. కర్కాటక, వృశ్చిక, మీనములలో నొకటి జన్మలగ్నమైనప్పుడు కర్కాటకము లగాయితు ఆ సంఖ్యవరకు లెక్కపెట్టగా వచ్చునది నవాంశ లగ్నమగును.

తులా, కుంభ, మీనములలో నొకటి జన్మలగ్నమైనప్పుడు తుల మొదలు లెక్కపెట్టవలయును. మకర వృషభ, కన్యలు జన్మలగ్నమైనచో మకరము మొదలు లెక్కపెట్టవలయును.

## గ్రహములకు వేధావిషయములను తెలుసుకొనుట

జన్మలగ్నముమొదలు పంద్రెండు రాశులయందును 9 గ్రహములున్నప్పుడు ఒక్కొక్కగ్రహమును ఇతర రాశుల యందున్న గ్రహములు కొన్ని వేధించుచుండును. వేధల విషయములో ఏ గ్రహము ఏ రాశియందుండునో, ఆ గ్రహమునకు ఆ రాశియే స్వస్థానముగ పరిగణింపవలయును. అట్టి వేధగలిగిన గ్రహములు శుభఫలమిచ్చునవేయైనను పూర్ణఫల ప్రదములుగా నుండవు. గ్రహవేధలు కలిగినను యిదివరలో తెలుపబడిన మూర్తినిర్ణయప్రకారముగ, గ్రహము సువర్ణ మూర్తియైనను, రజితమూర్తియైనను, ఫలప్రదములుగా నుండును. మూర్తినిర్ణయములను గ్రహవేధలను చూడకుండ గోచారఫలములను చెప్పువిధానము సరియైనదికాదు. అట్టి ఫలితములు తప్పిపోవును. ఆ విధముగా చెప్పువానిని పండితులు పూర్తిశాస్త్రజ్ఞానము లేనివానినిగ భావింతురు.

1. రవికి:- 4, 5, 9, 12 స్థానములయందున్న గ్రహములతో పరస్పరవేధ.

2. చంద్రునకు:- 2, 4, 5, 8, 9, 12 స్థానములందుండు గ్రహములు పరస్పరవేధల కలుగజేయును.

3. కుజునకు:- 5, 9, 12 స్థానములయందుండు గ్రహములు పరస్పర వేధలు.

4. బుధుడు:- 1, 3, 5, 8, 9, 12 స్థానములందుండు గ్రహములతో పరస్పరవేధ కలిగియుండును.

5. గురుడు:- 3, 4, 6, 8, 10 స్థానములయందుండు గ్రహములచే వేధించబడుచుండును.

6. శుక్రుడు:- 1, 5, 6, 7, 8, 9, 10, 11 స్థానస్థిత గ్రహముల వేధ.

7. శనికి:- 5, 9, 12 స్థానములయందున్న గ్రహములు వేధ.

8. రాహువునకు:- 5, 9, 11 స్థానములయందున్న గ్రహముల వేధ.

9. కేతువునకు:- 5, 9, 12 స్థానములలోనుండు గ్రహముల వేధ.

## గ్రంథాంతరములలో వేధల విషయములు

1. సూర్యునకు 4, 5, 9, 12 స్థానములలో శనితోనున్న గ్రహముల వేధ.

2. చంద్రునకు 2, 4, 5, 8, 9, 12 స్థానములయందుండు పాపగ్రహములవలన వేధ కలుగును.
3. కుజునకు 5, 9, 12 స్థానములనుండు శుభగ్రహముల వేధ.
4. శనికి 5, 9, 12 స్థానములనున్న గురుడు వేధ.
5. బుధునకు 1, 3, 5, 8, 9, 12 స్థానములలోనుండు సర్వగ్రహముల వేధ.
6. గురువునకు 3, 4, 6, 8, 10 స్థానములలో నేగ్రహమున వేధ.
7. శుక్రునకు 1, 5, 6, 7, 8, 9, 10, 11 స్థానస్థిత గ్రహ వేధ.
8. రాహు కేతువులకు 1, 5, 9, 12 స్థానములతోకూడిన అన్నిగ్రహములు వేధ. కేవలము శని కుజులున్నను యేగ్రహము లేకుండినను వేధాదోషములేదు.

మరియు:-

1. రవికి 3, 6, 10, 11 స్థానములలోనున్న గ్రహములు శుభము నిచ్చును.
2. చంద్రునకు 1, 3, 6, 7, 10, 11 స్థానములందుండు గ్రహములు శుభమును కలుగజేయును.

3. కుజునకు 3, 6, 11 స్థానములందుండు గ్రహములు శుభమును కలుగజేయును.

4. బుధునకు 2, 6, 8, 9 10, 11 స్థానములయందుండు గ్రహములు శుభమును కలుగజేయును.

5. గురునకు 2, 5, 7, 9, 11 స్థానములయందుండు గ్రహములు శుభము నిచ్చును.

6. శుక్రునకు 1, 2, 3, 4, 5, 8, 9, 11, 12 స్థానములయందుండు గ్రహములు శుభకరమైనవి.

7. శనికి 3, 6, 11 స్థానములయందుండు గ్రహములు శుభమునిచ్చును.

8. రాహువు, కేతువులకు 3, 6, 11 స్థానములయందుండు గ్రహములు శుభము నిచ్చును.

## వేధల ఫలితములు

శ్లో. రవివేధాఫలం యానం పశువిత్త వినాశనం,
జ్వరో వాతః పైత్యశూలే విఘ్నః పిత్రాది శత్రుతా.

తా. రవివేధవలన ప్రయాణమును, పశుధననాశనమును, జ్వరమును, వాతమును, పైత్యమును, శూలయు, ప్రయత్న కార్యములు చెడిపోవుటయు, తండ్రితోను, పితృవర్గము వారితోను శత్రుత్వము కలుగును.

శ్లో. స్త్రీ సౌఖ్యం మేహశాంతిర్వా సంతోషో నూత్న వాససే,
మృష్టాన్నభోజనం లాభం చంద్రవేధాఫలం భవేత్.

తా. చంద్రవేధవలన స్త్రీసౌఖ్యమును, మేహశాంతియు, సంతోషమును, నూతనవస్త్రప్రాప్తియు, భోజనసౌఖ్యమును, ధనలాభమును కలుగును.

శ్లో. కోపో యానం నేత్రబాధా పైత్యశూలా ధనవ్యయః,
మలబద్ధం ఫలాభావః కుజవేధాఫలం భవేత్.

తా. కుజవేధవలన కోపమును, ప్రయాణమును, నేత్ర రోగమును, పైత్యవృద్ధియు, వాతనొప్పులును, వివిధ రూపముల ధనవ్యయమును, మలబద్ధరోగమును, ప్రయత్న కార్యములు నిష్ఫలమగుటయు మొదలగు అశుభ ఫలితములు కలుగును.

శ్లో. జ్యోతిశాస్త్రాది వాదశ్చ సన్మానో యోగ్యచింతనం,
శుభకార్యం పుస్తకం చ బుధవేధాఫలం స్మృతమ్.

తా. బుధవేధవలన జ్యోతిషశాస్త్రమునకు సంబంధించిన వాదమును, గౌరవమును, మంచివిషయములను గురించి ఆలోచించుటయు, స్వగృహమున శుభకార్యములు జరుగుటయు, సద్గ్రంథ పఠనమును మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. కృషి ర్వాణిజ్య లాభౌచ బంధుమైత్రీసుఖం శుభం,
కార్యస్యాలోచనం పుష్టిః గురువేధాఫలం భవేత్.

తా. గురువేధవలన చేయువృత్తులయందు అనగా వ్యవసాయమునందుగాని, వ్యాపారమునందుగాని ధనలాభము కలుగుటయు, బంధుమిత్రాదులతో కలసి సుఖముగ జీవించుటయు, నూతనప్రయత్నములును, అందు జయమును, దేహారోగ్యమును, మొదలగు శుభఫలితములు కలుగును.

శ్లో. స్త్రీసౌఖ్యం ధాతువృద్ధిశ్చ సంతోష స్స్వర్ణ సంగ్రహః,
స్త్రీ విద్యాయాః ప్రసంగో వా పుత్రి సౌఖ్యం భవేత్ఫలమ్.

తా. శుక్రవేధవలన స్త్రీసంభోగసౌఖ్యమును, బలమును, తేజమును, అభివృద్ధియు, సంతోషమును, సువర్ణాభరణ ప్రాప్తియు, స్త్రీలతో విద్యావిషయమై ప్రసంగించుటయు, సంతానప్రాప్తియు, సంతానమూలమున సౌఖ్యమునుకలుగును.

శ్లో. శనివేధాఫలం నీచస్త్రీసంగో వీర్యనాశనం,
కలహో గర్భరోగశ్చ వాతః స్థాన విపర్యయః.

తా. శనివేధవలన నీచస్త్రీలతో పరిచయమును, బలహీనతయు, అనారోగ్యమును, తరచు కలహములు సంభవించుటయు, గర్భరోగములును, శరీరమున వాతవృద్ధియు, స్థానచలనమును, తరచు ప్రయాణములును కలుగును.

శ్లో. మూర్ఛా పిశాచపీడా చ మతద్వేషో మనోవ్యయః,
స్త్రీవిరోధ శ్శుక్లనష్టం రాహుం వేధాఫలం త్విదమ్.

తా. రాహుంవేధవలన మూర్ఛవ్యాధియు, పిశాచములవలన పీడింపబడుటయు, మతద్వేషమువలన కష్టములు ప్రాప్తించుటయు, వివిధరూపముల ధననష్టమును, స్త్రీలతో కలహము సంభవించుటయు, వీర్యనష్టము మొదలగు ఫలితములు కలుగును.

శ్లో. వేదాంతగోష్ఠి వైరాగ్యం చోరభీతిః మృగాద్భయం,
జ్వరశ్చౌషధసేవా చ కేతువేధా ఫలం స్మృతమ్.

తా. కేతువేధవలన వేదాంతగోష్ఠియు, ప్రపంచ విషయములయందు విరక్తియు, చోరులవలన ధననష్టమును, క్రూర మృగములవలన బాధయు, జ్వరపీడనమును, ఔషధసేవయు మొదలగు ఫలితములు కలుగును.

## గురుడు శుభమును కలుగజేయు నక్షత్రములు

జన్మనక్షత్రము లగాయితు 3, 5, 10, 15, 19, 25, 27 నక్షత్రములలో గురువున్నచో శుభఫలితములును, శని యున్నచో అశుభఫలితములును కలుగును.

## తారలయందు గ్రహఫలితములు

శ్లో. జన్మత్రిపంచ సప్తాసు తారాసు స్యాద్గ్రహాగమః,
యానం కుటుంబ శత్రుత్వం కష్టం దేహప్రపీడనమ్.
ద్వితీయే మిత్రతా క్షేమే సంతోషం సాధనే శుభం,
మిత్రే ధనం స్వల్పకష్టమంత్యే స్వల్పాశుభం వదేత్.

తా. 1.జన్మతారయందు రవి మొదలగు నవగ్రహములలో ఏగ్రహమున్నను దూరదేశప్రయాణమును,

2. సంపత్తారయందు ఏగ్రహమున్నను సౌఖ్యమును,
3. విపత్తారయందు కుటుంబకలహములును,
4. క్షేమత్తారయందు సంతోషమును,
5. ప్రత్య క్తారయందు కార్యనాశనమును,
6. సాధనతారయందు శుభప్రదమును,
7. నైధనతారయందు రోగమును,
8. మిత్రతారయందు ధనలాభమును,
9. పరమమైత్రతారయందు సామాన్యకష్టములును కలుగును.

### గ్రహముల బలములు

శ్లో. అర్కముక్త శ్చోదితస్యా ద్వితీయే శీఘ్రగో భవేత్
రవే స్తృతీయే సమతా గతిమందా చతుర్థకే
పంచమే వ్యథవా షష్ఠే కించిద్వక్రాచ వక్రగా

సప్తమాష్టమయోరర్కాదతి వక్రగతిర్భవేత్
నవమే దశమే భానోః ఖేటానాం కుటిలా గతిః
ఏకాదశే ద్వాదశే చ శీఘ్ర శీఘ్రతరాః క్రమాత్
రవిసంయుత ఖేటస్య గతిరస్తాహ్వయా భవేత్.

తా. రవితోకలసి ఒకేరాశియం దుండుగ్రహము అస్తంగత్వమును పొందును. అనగా తనబలమును కోల్పోవును. రవి యుండురాశికి ద్వితీయరాశియందుండు గ్రహము శీఘ్రగతిని బొందును. శీఘ్రగతినిబొందిన గ్రహముకూడ బలవత్తరములగు శుభఫలితములను కలుగజేయదు. మూడవ స్థానమందున్నచో సమగతియు, నాల్గవస్థానమునందున్న గ్రహము మందగతియు, పంచమస్థానమున స్తబ్దగతియు, ఆఱవ స్థానములో వక్రమును, ఏడవస్థానమునందుకూడ వక్రమును, ఎనిమిదివస్థానములో అతివక్రమును, తొమ్మిదవస్థానములో ఋజుత్వమును, దశమస్థానమున కుటిలగతియు, ఏకాదశ స్థానమున శీఘ్రగతియు పొందును. ద్వాదశమున అతి శీఘ్రగతియు ఈ విధముగ గ్రహబలములను తెలుసుకొని ఫలితములను నిరూపించవలయును.

వక్రముగాని అతిచారముగాని పొందిన గ్రహములకు పూర్వరాశిఫలితములనే చెప్పవలయును. గురుడు ఏరాశియందుండునో ఆరాశి ఫలితములనే కలుగజేయును.

రవ్యాది సప్తగ్రహములును వక్రగతి, అతివక్రగతి, బాలత్వము, వృద్ధత్వము, అస్తమయము, నీచ, ఉచ్ఛ, స్వ క్షేత్ర, మిత్రక్షేత్ర, సమక్షేత్ర శత్రుక్షేత్రములను పొందు చుండుటవలనను, యుద్ధపరాజితమగుటవలనను, వామవేధ, సమ్ముఖవేధ, దక్షిణవేధ బొందుటవలనను ఫలితములయందు మార్పుకలుగుచుండును. కనుక గ్రహగతుల విచారించి ఫలితములు చెప్పవలయును. రవి చంద్రులు స్వభావికముగ శీఘ్రగతి గలవారు, రాహుంకేతువులు వక్రగతి గలవారు, స్థాన దిక్చేష్టాబలంబులుకూడ విచారించి ఫలితము చెప్పుట మంచిది.

## నవగ్రహ పీడాహరణ నవరత్నముద్రికా లక్షణము

సూర్యప్రీతికై మధ్యను మాణిక్యమును, శుక్రునకు తూర్పున వజ్రమును, చంద్రునకు ఆగ్నేయమునందు ముత్యమును, కుజునకు దక్షిణమున ప్రవాళమును, రాహువు నకు నైరుతియందు గోమేధికమును, శనికి పశ్చిమమున ఇంద్రనీలమును, కేతువునకు వాయవ్యమున వైడూర్యమును, గురుప్రీతికై ఉత్తరమున పుష్యరాగమును, బుధప్రీతికై ఈశాన్యమున గారుత్మతపచ్చనుబెట్టి యథావిధిగ చేయించిన అంగుళీకమును ఎల్లప్పుడును ధరించుచున్న దుష్టగ్రహ పీడాశాంతి గలిగి ఆయురారోగ్యైశ్వర్యప్రాప్తిని పొందుదురు.

## గ్రహపీడశాంతికి సామాన్యశాంతులు

గురుశ్రేష్ఠులను పరిపాలించుటయు, దేవబ్రాహ్మణులకు భక్తితో నమస్కరించుచుండుటయు, వేదశాస్త్ర పురాణశ్రవణాదులవలనను, సజ్జన సహవాస సంభాషణాదికములవలనను, మనోనిర్మలత్వముగల పుణ్యకార్యములు చేయుటవలనను, జపము వలనను, దానమువలనను, హోమములు చేయుట వలనను, యజ్ఞములు మొదలగునవి చూచుటవలనను, గ్రహములు దుష్టస్థానములయందుండి కలుగజేయు చెడ్డ ఫలితములు విశేషముగ నుండవు.

## గ్రహములు ఫలితముల నిచ్చుకాలములు

శ్లో. ఆదిగతౌ ఫలదౌ రవిభౌమౌ మధ్య
గతౌ ఫలదౌ గురుశుక్రౌ,
అంత్యగతౌ ఫలదౌ శనిచంద్రౌ సర్వ
గతౌ ఫలదౌ బుధ రాహువూ.

తా. సర్వగ్రహములు ఫలమిచ్చుకాలములు తెలుసుకొనుటకు వారికాలములు 3 సమభాగములుగ చేయగా రవి కుజులు వారున్న రాశియొక్క ప్రధమఖండమునను, గురు శుక్రులు మధ్యమఖండమునందును, శని చంద్రులు అంత్య ఖండమునందును పూర్ణఫలప్రదులగుదురు. బుధ, రాహువులు రాశిసంచారస్థితిలో ఎల్లప్పుడును పూర్ణఫలితమునే యిచ్చుచుందురు.

## నక్షత్రములకు ప్రత్యేక గ్రహదృష్టి

సకలగ్రహములును రాసులను జూచినట్లే నక్షత్రములను గూడ చూచుచుండును. రవి, చంద్రులు తామున్న నక్షత్రము నుండి 14, 15 నక్షత్రములను జూచుచుందురు. పూర్ణ చంద్రునియొక్క దృష్టి శుభమును కలుగజేయును. క్షీణ చంద్రదృష్టి అశుభఫలితముల నిచ్చును. శని తానుండు నక్షత్రము లగాయితు 3, 15, 19 నక్షత్రములను జూచు చుండును. గురుడు తానున్న నక్షత్రము లగాయితు 10, 15, 19 నక్షత్రములను, కుజుడు తానుండు నక్షత్రము మొదలు 3, 7, 8, 15 నక్షత్రములను, బుధ శుక్రులు తామున్న నక్షత్రము లగాయితు 1, 15, నక్షత్రములను జూచు చుందురు.

## గ్రహవీక్షిత నక్షత్ర ఫలములు

రవి జన్మనక్షత్రమునుగాని, నామనక్షత్రమునుగాని జూచు చున్నచో రోగమును, ధననష్టమును కలుగును. క్షీణచంద్ర దృష్టికూడ మంచిదికాదు. కుజదృష్టికూడ అశుభఫలితములనే కలుగజేయును. బుధదృష్టి లాభకరము. శనిదృష్టివలన ఆపదలును, మరణము కూడ సంభవించును.

## నక్షత్రములకు ద్విత్ర్యాది గ్రహ దృగ్యోగ ఫలము

రవిచంద్రులు జన్మనామనక్షత్రములను జూచుట మృత్యుపదము. రవి కుజుల దృష్టియు మృత్యుప్రదమే. రవి బుధ దృష్టివలన భంగమును, పలాయనమును కలుగును. రవి గురు దృష్టివలన జయము, లాభము, సౌఖ్యము కలుగును. రవి శుక్రుల దృష్టివలన మరణము, రవి శనుల దృష్టికూడ మృత్యుప్రదమే కలుగజేయును. చంద్ర కుజులు కలసి చూచినను ఆఫలితమే కలుగును. బుధ చంద్రుల దృష్టివలన లాభమును, చంద్ర శుక్రుల వీక్షణమువలన జయమును, లాభమును కలుగును. శని చంద్రదృష్టివలన మరణము కలుగును. గురు, బుధ దృష్టివలనను, బుధ శుక్ర వీక్షణము వలనను విశేషలాభమును, కార్యజయమును కలుగును. బుధ శనులు చూచుటవలనను, గురు శనులు చూచుటవలనను భంగమ కలుగును, కాని మృత్యుపదము మాత్రముకాదు. గురు శుక్ర వీక్షణ లాభకరము. గురు శని వీక్షణ భంగకరము. శని శుక్ర వీక్షణ మృత్యుప్రదము. నాలుగు నైసర్గిక పాప గ్రహములు చూచుచున్నచో తప్పక మరణము సంభవించును. నాలుగు శుభగ్రహములు అనగా చంద్ర బుధ గురు శుక్రులు చూచుచున్నచో విశేషలాభమును, జయమును, సౌఖ్యమును కలుగును.

## వక్రాది గ్రహముల ఫలములు

వక్రగతిపొందిన శుభగ్రహదృష్టియు, సమగతిగల పాపగ్రహదృష్టియు, శీఘ్రగతిగల శుభగ్రహదృష్టియు విశేష శుభఫలితముల నిచ్చును. అస్తంగతుడైనను, నీచయందుండు శుభగ్రహముయొక్క వీక్షణ శుభఫలము కలుగజేయలేదు. పాపగ్రహముతో కలిసిన శుభగ్రహముయొక్క వీక్షణ ధననష్ఠమును కలుగజేయును. శీఘ్రగతిగల పాపగ్రహము యొక్క వీక్షణ సమఫలములనుమాత్రమే నిచ్చును. జన్మ రాశ్యాధిపతి రవితో కలసియున్నచో విశేష అశుభఫలితములు కలుగజేయును. శుక్లపక్షమున శుభులును, కృష్ణపక్షమున పాపులును పగలు పూర్వాహ్ణమున శుభులును, అపరాహ్ణమున పాపులును, పూర్వరాత్రియందు శుభులును, అపరరాత్రియందు పాపులును ముందుదృష్టి కలిగియుందురు. మిగిలిన సమయములయందు వెనుక దృష్టి కలిగియుందురు. వెనుక దృష్టికంటె ముందుదృష్టి చాల మంచిది.

## నక్షత్రముల జాతులు

1. కృత్తిక, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, పునర్వసులు : బ్రాహ్మణజాతి.
2. మృగశిర, చిత్త, అనూరాధ, రేవతి, ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, మఖలు : క్షత్రియజాతి.

3. భరణి, ధనిష్ఠ, పుష్యమి, మఖ, హస్తలు : వైశ్యజాతి.
4. అశ్విని, రోహిణి, స్వాతి, ఆర్ద్ర, మూల, శతభిషములు : శూద్రజాతి.
5. విశాఖ, శ్రవణ, ఆశ్లేష, జ్యేష్ఠలు : చండాలజాతి.

## మేషాది ద్వాదశరాసుల లక్షణములు

మేషరాశి :-

ఈ రాశి క్షత్రియజాతి, పురుషరాశి, మేక ఆకారము, చరరాశి, రక్తవర్ణము, తూర్పుదిక్కు, పృష్ఠోదయము. అధిపతి కుజుడు అనగా కుజునకు స్వ క్షేత్రము, శనికి నీచస్థానము, రవికి ఉచ్చరాశి, ప్రథమ తృతీయ ద్రేక్కాణములు పురుష సంజ్ఞ, ద్వితీయ ద్రేక్కాణము చతుష్పాదసంజ్ఞ, మొదటి 10 భాగములు రవికి ఉచ్చ, 20 భాగములు శనికి నీచము, మొదటి 18 భాగములు కుజునకు మూలత్రికోణము.

వృషభ రాశి :-

ఈ రాశి శూద్రజాతి, స్త్రీలింగము, వృషభస్వరూపము, శ్వేతవర్ణము, స్థిరరాశి, పృష్ఠోదయము, శుక్రునకు స్వ క్షేత్రము శని కుజ బుధులకు మిత్రక్షేత్రము. ఈరాశిని 30 సమ భాగములు చేయగా మొదటి 3భాగములు చంద్రునకు ఉచ్చ, మిగిలిన 27 భాగములు చంద్రునకు మూలత్రికోణము,

ఆగ్నేయ దిక్కు, శని కుజ బుధులకు మిత్రక్షేత్రము, ప్రథమ ద్రేక్కాణము పురుషసంజ్ఞయు, ద్వితీయ తృతీయ ద్రేక్కాణములు చతుష్పాదసంజ్ఞయు కలిగియుండును.

మిథునరాశి :-

ఈ రాశి వైశ్యజాతి, పురుషరాశి, ఆకుపచ్చవర్ణము, స్త్రీ పురుషద్వంద్వము, పడమటిదిక్కు, శీర్షోదయము, బుధునకు స్వక్షేత్రము. చంద్ర శుక్ర గురు కుజ శనులకు మిత్రక్షేత్రము. ప్రథమ ద్వితీయ తృతీయ ద్రేక్కాణములు క్రమముగ స్త్రీ, పక్షి, పురుషసంజ్ఞలు కలది. క్రూరస్వభావము-ద్విపాద జంతువులు, ద్విస్వభావరాశి, మధ్యమరతి, చివర నవాంశము వర్గోత్తమాంశము.

కర్కాటకరాశి :-

కర్కాటకము బ్రాహ్మణజాతి, పృష్ఠోదయము, స్త్రీరాశి, శ్వేతరక్త మిశ్రమవర్ణము, ఆకారము ఎండ్రకాయ, చరరాశి, ఉత్తరదిక్కు, చంద్రునకు స్వక్షేత్రము, గురునకు ఉచ్ఛ, కుజునకు నీచ, బుధునకు మిత్రక్షేత్రము, ప్రథమ నవాంశ వర్గోత్తమాంశము. దీని 30 భాగములలో 5 భాగములు గురునకు ఉచ్ఛ, మొదటి 28 భాగములు కుజునకు నీచ.

సింహరాశి :-

ఇది క్షత్రియజాతి, సింహ ఆకారము, స్థిరరాశి, పురుష రాశి, ధూమ్రపీతవర్ణము, అల్పరతి, క్రూరస్వభావము, సూర్యునకు స్వక్షేత్రము, గురునకు మిత్రక్షేత్రము, పంచమ నవాంశము వర్గోత్తమాంశము, ప్రథమ, ద్వితీయ, తృతీయ ద్రేక్కాణములు క్రమముగ పక్షి, పురుష, చతుష్పాద సంజ్ఞ గలవి, తూర్పుదిక్కు, అగ్నితత్త్వము, శీర్షోదయరాశి, పిత్త ప్రకోపము.

కన్యారాశి :-

ఇది వైశ్యజాతి, స్త్రీరాశి, స్త్రీ ఆకారము, ద్విస్వభావరాశి, పింగళవర్ణము, దక్షిణదిక్కు, వాతతత్వముగలది, అల్పరతి, శీర్షోదయరాశి, రాత్రులయందు బలముకలది, ఉత్తరమందు ప్లవత్తముకలది. ఈరాశికి అధిపతి బుధుడు. ఇందు మొదటి 27 భాగములు శుక్రునకు నీచ. ఇందు ప్రథమ తృతీయ ద్రేక్కాణములు స్త్రీ, పురుషసంజ్ఞలు కలవి. ఈ రాశి కుజ, శని, చంద్ర గురులకు మిత్రక్షేత్రము. చివరి నవాంశ వర్గోత్తమాంశము. ఇందు మొదటి 15 భాగములు బుధునకు ఉచ్ఛ, తృణభూసంచారము, శీతస్వభావమును కలిగి యుండును.

తులారాశి :-

తులారాశి శూద్రజాతి, త్రాసు అనునామము గలది. శ్వేత నీలముతోకూడిన చిత్రవర్ణముగలది. పురుషరాశి, శీర్షోదయ రాశి, పశ్చిమదిక్కు. వైశ్యజాతియని కొందరు వ్రాసిరి. క్రయ స్థానసంచారము, ఉష్ణము, చరరాశి, పగటియందు బలము కలది. ఇందు మొదటి 20 భాగములు శనికి ఉచ్ఛ, మొదటి 10 భాగములు రవికి నీచ. ఈరాశి శుక్రునకు స్వక్షేత్రము, రవి కుజ బుధ గురులకు మిత్రక్షేత్రము, ప్రథమనవాంశము వర్గోత్తమాంశము. ప్రథమ, ద్వితీయ ద్రేక్కాణములు వరుసగా పురుష పక్షి చతుష్పాదసంజ్ఞలు కలవి. స్వల్పరతి, స్వల్ప సంతానము, దుర్బలత్వమును కలిగియుండును.

వృశ్చికరాశి :-

వృశ్చికము బ్రాహ్మణజాతి. స్త్రీజాతి, పీతవర్ణము, వృశ్చికఆకారము, బహుపదములు గలది, శీర్షోదయరాశి, స్థిర రాశి, ఉత్తరదిక్కు, రాత్రియందు బలముకలది, దీర్ఘరూపము. కుజునకు స్వక్షేత్రము. చంద్రునకు నీచ, బుధ శుక్రులకు మిత్రక్షేత్రము. ప్రథమ ద్వితీయ ద్రేక్కాణములు సర్పసంజ్ఞ. ప్రథమములో 3 భాగములు చంద్రునకు నీచ, పంచమ నవాంశము వర్గోత్తమాంశము, అధికరతియు, మర్మాంగమును కలిగియుండును.

ధనురాశి :-

ధనుస్సు క్షత్రియజాతి, ద్విస్వభావరాశి, తూర్పుదిక్కు పృష్ఠోదయరాశి, రక్త కపిలవర్ణము, అర్ధబలము, పురుషరాశి, విల్లు గుఱ్ఱపు పిరుదులుకలిగిన పురుషాకారము గలది. పగటి వేళ బలము గలది. ప్రథమ ద్వితీయ తృతీయ ద్రేక్కాణములు క్రమముగ చతుష్పాద స్త్రీ పురుష సంజ్ఞకలది. గురునకు స్వక్షేత్రము. రవి, చంద్ర, శుక్ర, శని, బుధులకు మిత్ర క్షేత్రము. చివరినవాంశ వర్గోత్తమాంశము. ఉష్ణపైత్యతత్వము మూడుకిరణములు. ఈశాన్యమున ప్లవతత్వముకలది. స్వల్ప రతియు, స్వల్పసంతానమును గలిగియుండును.

మకరరాశి :-

మకరరాశి శూద్రజాతి. బూడిదరంగు, స్త్రీ సంజ్ఞ కలది. చరరాశి. దక్షిణదిక్కు, పృష్ఠోదయము. మొసలిరూపము, జల ప్రదేశములలో సంచారము. రాత్రియందు బలముకలిగి యుండును. వాతతత్వముకలది. శనికి స్వక్షేత్రము. గురునకు నీచ. కుజునకు ఉచ్ఛ, ప్రథమ నవాంశము వర్గోత్తమాంశము. దీని ముందుభాగము చతుష్పాదసంజ్ఞ, వెనుకభాగము జలచర స్వరూపము. ధాతుపదార్థములకు ఆధిపత్యము వహించును. పక్షిరూపము, కాంతిరహితముగ నుండును.

కుంభరాశి :-

కుంభరాశి శూద్రజాతి. నీలముతోకూడిన చిత్రవర్ణము గలది. పశ్చిమదిక్కు. శీర్షోదయము, స్థిరరాశి. పగలు బలము గలది. భుజముమీద నీరులేని కుండను ధరించిన పురుష ఆకారము. పురుషలింగము. క్రూరస్వభావము. దీనియందు మొదటి 20 భాగములు శనికి త్రికోణము. కుంభము శనికి స్వక్షేత్రము. బుధ, గురు, శుక్రులకు మిత్రక్షేత్రము. వాత పిత్త తత్వము, ద్రవపదార్థముల కధికారి. పంచమ నవాంశము వర్గోత్తమాంశము.

మీనరాశి :-

మీనము బ్రాహ్మణజాతి. ద్విస్వభావరాశి. చేపఆకారము. ఉత్తరదిక్కు ఉభయోదయరాశి, పురుషస్వభావము. జలముల యందు సంచారము. ద్రవపదార్థములకు కారకత్వము. రాత్రి యందు బలము గలది. అధికరతి. అధికసంతానము, పాద హీనము, శబ్దరహితము. బలహీనమును కలిగియుండును. ఇది గురువునకు స్వక్షేత్రము. 23 భాగములు శుక్రునకు ఉచ్ఛ. మొదటి 15 భాగములు బుధునకు నీచ. రవి చంద్రులకు మిత్ర రాశి. చివర నవాంశ వర్గోత్తమాంశము. ఒకదాని కొకటి ఎదురు ముఖములతోనుండు రెండుచేపల

ఆకారము. ప్రథమ ద్రేక్కాణము పురుషసంజ్ఞయు, ద్వితీయ ద్రేక్కాణము స్త్రీ సంజ్ఞయు, తృతీయ ద్రేక్కాణము సర్ప సంజ్ఞయు కలది.

## గ్రహముల కారకత్వములు

1. సూర్యుని కారకత్వములు:- కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములలో జన్మించినవారికి జననకాలమునందు సూర్య దశ ప్రారంభమగును. సూర్యదశప్రమాణము 6 సంవత్సర ములు. సూర్యుడు క్షత్రియగ్రహము. పగలు జన్మించిన వారికి పితృకారకుడు రవియగును. రాత్రి జన్మించినవారికి పితృకారకుడు శని. సూర్యుడు తానున్న రాశిలగాయితు ఏడవ స్థానమును, అందున్న గ్రహములనుకూడ చూచు చుండును. రవి క్రూర గ్రహము. రవికి కుజ, గురు, చంద్రులుమిత్రులు. శని, శుక్రులు శత్రువులు. బుధుడు సముడు. రవి ఆత్మ కారకుడు. రవి ఆరోగ్యమునకుకారకుడు. ఇది పురుష గ్రహము. రక్తవర్ణము గలవాడు. గోధుమలయందు ప్రీతి. రవి నేత్రములకు కారకుడు. గోచారరీత్యాగాని జాతకమునందు గాని రవి మంచి స్థానములలో నున్నచో రాజకీయ వ్యవహారములలోజయమును, రాజకీయ ఉద్యోగ ప్రాప్తియు, కీర్తియు, మంచిఆరోగ్యమును, తేజస్సును, బలమును, ప్రయత్నకార్యములలో జయమును కలిగించుచుండును. రవి

నీచ యందున్నను, చెడ్డస్థానములలో నున్నను వివిధ రూపముల ధననష్టమును, అపకీర్తియు, రాజదండనాది భయములును, కోర్టువ్యవహారపు చిక్కులును, ప్రయత్న కార్యములు సఫలీకృతముగాకుండుటయు, శిరోవ్యాధియు, జ్వరమును, నేత్ర రోగములును, పితృమరణమును, రాజ భయమును కలుగును. రవి పగలు బలము గలవాడు. సర్వ గ్రహములయందును రవి ముఖ్యగ్రహము. అందుచే జాతకములో రవి బలసంపన్నుడుగనున్నచో జీవితము యోగదాయకముగను, సౌఖ్యదాయకముగను నుండును. రవి బలహీనుడై మిగిలిన గ్రహములు బలయుక్తముగ నున్నను జీవితము అంత బాగుగ యుండదు.

2. చంద్రుని కారకత్వములు:- రోహిణి, హస్త, శ్రవణము నక్షత్రములలో జన్మించినవారికి జననకాలమునకు చంద్ర మహాదశ వచ్చును. చంద్రమహాదశయొక్క ప్రమాణము 10 సంవత్సరములు. చంద్రుడు మాతృకారకుడు. ఉప్పు, బియ్యము, తెల్లనివస్త్రము చంద్రునకు ప్రీతికరమైన వస్తువులు. చంద్రుడు తానున్న రాశిలగాయితు 7-వ స్థానమును, అందున్న గ్రహములను చూచుచుండును. పూర్ణ చంద్రుడు శుభగ్రహము. చంద్రునకు రవి, బుధులు మిత్రులు, కుజ, గురు, శుక్ర, శనులు సములు. శత్రువులు

లేరు. పగలు జన్మించినవారికి చంద్రుడును, రాత్రి జన్మించినవారికి శుక్రుడును మాతృకారకులు. చంద్రుడు వైశ్యగ్రహము. జాతకములో చంద్రుడు ఏరాశి యందుండునో ఆరాశి లగ్నముగా భావించి గోచారఫలితములు చూచుకొన వలయును. చంద్రుడు తెలుపు రంగు గలవాడు. జాతకము నందుగాని గోచారమునందుగాని చంద్రుడు శుభస్థానములలో నున్నచో వ్యాపారమూలమున ధనలాభమును, స్త్రీసంతాన ప్రాప్తియు, సముద్ర ప్రయాణమును, నూతనవస్త్రప్రాప్తియు కలుగును. మరియు ఆలోచనాశక్తియు, దేవబ్రాహ్మణభక్తియు, శాంతస్వభావమును, ప్రశాంతజీవితమును, భోజనసౌఖ్యమును కలుగును. చంద్రుడు నీచయందున్నను, క్షీణుడైనను, పాప స్థానములయందున్నను మాతృనష్టమును, కృషివాణిజ్యముల మూలమున ధననష్టమును, జలగండభయమును, సంతాన నష్టమును, వివిధరూపముల చిక్కులు ప్రాప్తించుటయు సంచారమును కలుగును. మరియు వాతరోగములును, శ్లేష్మ రోగములును సంభవించును. చంద్రుడు పొట్టిగ్రహము, ఆగ్నేయ దిక్కు, జలతత్వము, జలమధ్యస్థానము, రాత్రుల యందు బలముకలవాడు.

3. కుజుని కారకత్వములు :- మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రములలో జన్మించినవారికి జననకాలమునందు కుజ

మహాదశ ప్రారంభమగును. కుజమహాదశయొక్క ప్రమాణము 7 సంవత్సరములు. కుజుడు తానున్న రాశి లగాయితు 4, 7, 8 స్థానములను, అందున్న గ్రహములను చూచుచుండును. కుజునకు రవి, గురు, చంద్రులు మిత్రులు. బుధుడు శత్రువు. శని శుక్రులు సములు. కుజుడు పురుషగ్రహము, క్షత్రియ జాతి, రాత్రియందు బలవంతుడు, దక్షిణదిక్కు, అగ్నితత్వము, రక్తవర్ణము, దహనముచేయు స్వభావము కలవాడు. అన్న దమ్ములు, అక్కచెల్లెండ్రు, భూమి, సేవకులు, సాహసము, పరాక్రమము, సేనాధిపత్యము, వ్రణము, స్ఫోటకము, యుద్ధము, విరోధము, కోపము, చిత్తచాంచల్యము, కత్తిపోటు మొదలగువాటికి కారకుడు. కుజుడు నైసర్గిక పాపగ్రహము. కుజుడు జాతకమునందుగాని, గోచారరీత్యాగాని శుభస్థానము లలో నున్నచో భూలాభమును, సహోదర సౌఖ్యమును, వివాదమున జయంబును, సువర్ణాభరణప్రాప్తియు, మాణిక్య లాభమును, పశువృద్ధియు, వ్యవసాయమూలమున ఫలాధిక్య మును కలుగును. కుజుడు నీచయందున్నను దుష్టస్థానము లయందున్నను వ్రణ, స్ఫోటకాదులవలనను, కత్తిపోటువలనను భయమును, భూనష్టమును, అకారణ కలహములును, వివాదమున అపజయంబును, సహోదరులతో వివాదము, సంచారమును కలుగును. సుబ్రహ్మణ్యప్రీతి, విదేశ యానము, రాజసేవ మొదలగువాటికి కారకుడు. గోచారరీత్యా

కుజుడు ప్రతిరాశియందును నెలాపదిహేను దినములుండును. కుజుడు బలహీనుడుగనున్నచో రాజవిరోధమును, చోరాగ్ని బాధలును, కుటుంబ కలహములును, కార్యనాశనమును కలుగును. ఈ గ్రహమునకు చేదువస్తువులును, కందులును ప్రీతికరములైనవి.

4. బుధుని కారకత్వములు :- ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములలో జన్మించినవారికి జననకాల మహాదశ బుధ మహాదశయగును. బుధమహాదశయొక్క ప్రమాణము 17 సంవత్సరములు. బుధుడు తానున్నరాశి లగాయితు సప్తమ స్థానమును జూచుచుండును. బుధునకు రవి, శుక్రులు మిత్రులు. చంద్రుడు శత్రువు. కుజ, శని, గురులు సములు. మిథున, కన్యలు స్వక్షేత్రములు. అందు కన్య ఉచ్ఛ, మీనము నీచస్థానము. శుభగ్రహములతోకలసిన శుభుడును, పాపగ్రహములతో కలసిన పాపియు నగును. ఏ గ్రహ సంబంధములేనప్పుడు శుభుడేయగును. వైశ్యజాతి. బాలుడు. ఈశాన్యదిక్కు. నపుంసకుడు. రాత్రియు, పగలునకూడ బల వంతుడు. పచ్చపెసలయందు ప్రీతి. గణితము, జ్యోతిషము, శిల్పము, వాణిజ్యము, పితామహులు, వ్యాకరణ శాస్త్రము, శాస్త్రపరిశోధన, తంత్రము, విజ్ఞానము, కర్మ, విష్ణోపాసన, వైద్యము, విజ్ఞానము, మోసము, రత్నపరీక్ష, నాభి, మంత్రము

మొదలగువాటికి కారకుడు. జాతకమునందు బుధుడు బలముగానుండి అనగా శుభస్థానములలో నుండిన ఆ బుధ మహాదశలో విద్యాభివృద్ధియు, శాస్త్రపరిశోధనయు, వైశ్య జనులతో పరిచయమును, వ్యాపారమూలమున విశేషధన లాభమును కలుగును. గోచారరీత్యా బుధుడు శుభస్థానము లకు వచ్చినప్పుడుకూడా పైనచెప్పబడిన ఫలితములే కలుగును. రవి, బుధులు కలసినచో బుధాదిత్య యోగము కలుగును. మరియు బుధుడు వాక్కు, హాస్యము, గ్రంథములకుకూడ కారకుడగుచున్నాడు. బుధుడు బలము గలిగి శుభస్థానములలో నున్నప్పుడు పైన చెప్పబడిన విషయములలో అభివృద్ధియు, బలహీనుడుగనుండి అశుభ స్థానములలోనున్నచో పైనచెప్పబడిన విషయములకు ప్రతికూల ఫలితములు కలుగును.

5. గురుని కారకత్వములు :- పునర్వసు, విశాఖ, పూర్వాభాద్రానక్షత్రములయందు జన్మించినవారికి జననకాల మహాదశ గురుదశ అగును. గురుమహాదశయొక్క ప్రమాణము 16 సంవత్సరములు. గురుడు తానుండు రాశి లగాయితు 5, 7, 9 స్థానములను అందుండు గ్రహములను చూచుచుండును.

గురునకు రవి, కుజ, చంద్రులు మిత్రులు. బుధశుక్రులు శత్రువులు. శని సముడు. ధనుస్సు, మీనము యీరెండు

రాసులు స్వక్షేత్రములు. కర్కాటకము ఉచ్చరాశి. మకరము నీచ. బ్రాహ్మణజాతి. ఉత్తరదిక్కు. పసుపువర్ణము. పురుష గ్రహము. శుభుడు.

జాతకమునందు గురుడు శుభస్థానములోనుండుటచే జాతకునకు మంచిప్రవర్తన కలుగును. గురుడు ప్రతిరాశి యందును ఒక సంవత్సరముండును. గురుడు గోచారరీత్యా 2, 3, 5, 7, 9, 11 స్థానములలోకి వచ్చినప్పుడు ఆ సంవత్సరములందు జీవితము సౌఖ్యదాయకముగను, లాభ కరముగను నుండును. గురుడు పగలు బలవంతుడు.

ధనము, సంతానము. గృహము, సంస్కృతము, పౌత్రులు, జ్యోతిషవిద్య, కవిత్వము, స్వకులాచారములను పాటించుట, మంచిప్రవర్తన, దైవభక్తి, జ్ఞానము, నీతి, కీర్తి, అధికారము, వాహనము, పరోపకారము, తీర్థయాత్ర, మంచివారితో పరిచయము, సభాపూజ్యత, అభివృద్ధి, మృదుసంభాషణ, విద్య, పరిశుభ్రత, సువర్ణము మొదలగు విషయములకు కారకుడు. జాతకములో జన్మలగ్నమునందు గురుడున్నచో మంచిప్రవర్తన కలుగును. జన్మలగ్నమును గురుడు చూచుట వలనకూడా మంచిప్రవర్తన కలుగును. మొత్తముమీద జన్మ లగ్నమునకు ఏదోవిధముగ గురుసంబంధముండుట చాల మంచిది. జాతకములో గురుడు బలవత్తరముగనున్నచో

సుఖజీవనమును. అధికారమును లభించును. నవగ్రహముల యందును గురుడు పరిపూర్ణశుభుడు. సెనగలు, పసుపు పచ్చని బట్టలయందు ప్రీతికలవాడు.

6. శుక్రుని కారకత్వములు :- భరణి, పూర్వఫల్గుని, పూర్వాషాఢ నక్షత్రములలో జన్మించినవారికి జననకాలము నందు శుక్రమహాదశ వచ్చును. శుక్రమహాదశయొక్క ప్రమాణము 20 సంవత్సరములు.

శుక్రుడు తానున్న రాశి లగాయితు 7-వ స్థానమును, ఏడవస్థానమునందున్న గ్రహములనుకూడ చూచుచుండును. శుక్రునకు శని, బుధులు మిత్రులు. రవి చంద్రులు శత్రువులు. గురు కుజులు సములు. బ్రాహ్మణజాతి, స్త్రీగ్రహము. రాజస గుణము.

శుక్రునకు వృషభ, తులారాసులు స్వక్షేత్రములు, మీనము ఉచ్చ, కన్యనీచ. తూర్పుదిక్కు. దివాబలము కలవాడు. శ్వేతవర్ణము గలవాడు.

శుక్రుడు వివాహం, భాగ్య, భోగ్య, వాహన, మంత్రిత్వ, ప్రాబల్య, స్త్రీసంభోగ, కుటుంబ, కళత్ర, రజిత, మౌక్తిక, ధవళాంబర, దృష్టిప్రకాశ, వృష్టి, కవిత్వ, కౌశల్య, సుభోజన, శయ్యా, వినోద, కేళీ, గాన, కామ, పుష్ప, గంధ, భోగ, శ్వేతఛత్ర, చామర, కీర్తి, యజుర్వేద, సౌందర్య, క్రయ,

విక్రయ, సరస, సల్లాప, మాతంగ, తురంగ, నృత్య, గీత, హాస్య, నేత్ర, సత్యవచన, రేతస్సు, జలక్రీడ, భరతశాస్త్ర, గాంభీర్య, ముత్య, రాజముద్ర, రతి, ప్రభుత్వ, మాతృ, జారత్వ, అష్టైశ్వర్య, జలసంచార, సింహాసన, మేహ, అతిమూత్ర, పరిమళములకు కారకుడు.

శుక్రుడు ప్రతిరాశియందును ఒకనెలమాత్రమే యుండును. జాతకములో శుక్రుడు బలముగా నున్నచో, అనగా శుభస్థాన ములయందున్నచో సౌందర్యవతియు, సకలసుగుణ సంపన్ను రాలును అగు భార్య లభించును. శుక్రుడు శుభ స్థానములలో నున్నచో వాహనసౌఖ్యమును, రాజ సన్మానమును కలుగును.

7. శని కారకత్వములు:- పుష్యమి, అనూరాధ, ఉత్తరా భాద్ర నక్షత్రములలో జన్మించినవారికి జననకాలమునందు శని మహాదశ నడచును. శని మహాదశయొక్క ప్రమాణము 19 సంవత్సరములు, శనికి బుధ, శుక్రులు మిత్రులు. కుజ, రవి, చంద్రులు శత్రువులు. గురుడు సముడు. శూద్రజాతి. నపుంసకుడు. తమోగుణముగలవాడు. శని శరీరమునందు ఎముకలకు ఆధిపత్యము వహించుచున్నాడు. నల్లని శరీరము. వాతతత్వము గలవాడు. పశ్చిమదిక్కునందు బలముగలవాడు. గోచారరీత్యా శని ప్రతిరాశియందును రెండు సంవత్సరముల ఆరుమాసములుండును. మందగ్రహము. శనికి మకర, కుంభ

రాశులు స్వక్షేత్రములు, మేషము నీచ, తుల ఉచ్చరాశి. శని తానున్నరాశి లగాయతు 3, 7, 10 స్థానములను, అందుండు గ్రహములనుకూడ చూచుచుండును. నైసర్గిక పాపగ్రహము. ఆయుష్కారకుడు. తిలలు మొదలగు వగరు వస్తువుల యందును, నలుపురంగుగల వస్త్రములయందును ప్రీతి గలవాడు.

శని మరణము, రోగము, చర్మము, ఏనుగులు, గుఱ్ఱములు, కలహము, గురుధిక్కారము, వ్యవసాయ జీవనము, పశువులు, అజీర్ణము, దీర్ఘవిచారము, కఠినచిత్తము, రాత్రి, అన్యకులవిద్య, అరణ్యాపర్వత ప్రాంత సంచారము, పానము, ద్యూతము, పాపము, నరకము, మహిషము, వాద్య ధ్వని, విక్రయము, లోహము, దుస్సహవాసము, కార్య భంగము, సేవకావృత్తి, మోసము, తైలము, తిలలు, భాండము, నీలవస్త్రము, కారాగృహము, అనాచారము, పర దూషణ, కిరాతత్వము, నీచకార్యములు, పరుల కపకారము చేయుట, మలిన వస్త్రధారణములకును కారకుడు.

శని తరుచుగ వక్రించుచుండును. నైసర్గిక పాప గ్రహములు వక్రించినచో విశేష అశుభఫలితములు కలుగు చుండును. మరియు శని సజ్జనవిరోధమునకును, కుటుంబ చిక్కులకును, మూర్ఛ, నిద్ర, వాతరోగము, అండవాయువు, పునర్వివాహమునకును కారకుడు.

8. రాహువు కారకత్వములు :- ఆర్ద్ర, స్వాతి, శతభిషము లలో జన్మించినవారికి జననకాలములో రాహుమహాదశ జరుగును. రాహువు ఛాయాగ్రహము. కుంభరాశి. స్వక్షేత్రము. తమోగుణముకలవాడు. నపుంసకగ్రహము. రాహువు ఛండాలుడుగను, కేతువు మ్లేచ్ఛగ్రహముగను పరిగణింపవలయును. రాహువు తానుండు రాశి లగాయితు 7-వ స్థానమును, అందుండు గ్రహములను చూచు చుండును. కొందరు రాహు కేతువులను స్త్రీ గ్రహములుగ పరిగణించుచున్నారు. రాహు కేతువులకు ప్రత్యేకించి ఏ ఆధిపత్యములును లేవు. రాహు కేతువులు ఏరాశి యందుందురో ఆ రాశ్యాధిపతి కలుగజేయు ఫలితములను కలుగజేయుచుందురు. లేదా ఎవ్వరితో కలసియుందురో, ఎవ్వరిచే చూడబడుచుందురో యీ ముగ్గురిలో బలాధిక గ్రహముయొక్క ఫలితముల నిచ్చుచుందురు. పాపులతో చేరిన పాపఫలితములను, శుభులతో చేరిన శుభఫలితములను కలుగజేయుచుందురు. శనికి చెప్పబడిన శత్రు, మిత్ర, సములే రాహు కేతువులకుకూడ శత్రు, మిత్ర, సమగ్రహము లుగ చెప్పిరి. మినుములు ప్రీతి. చేదువస్తువుల రసము నందు ప్రీతికలవాడు. రాహువు విషవైద్యమునకు కారకుడని చెప్పుదురు. రాహువు మాతామహులు, ఆరామము, తటాకము, గ్రహపీడ, దుర్గోపాసన, ప్రతాపము, అడవులలో

సంచరించుట, కఠినముగ మాట్లాడుట, సహోదరనష్టము, తీర్థ యాత్ర, నేత్రరోగము, అపసవ్యనడక, నీచాశ్రయము, హరాణవిద్య, అన్యభాష, వైధవ్యములకు కారకుడు. మరియు శనికి చెప్పబడిన కారకత్వములన్నియుకూడ రాహువునకు చెప్పవలయునని గ్రంథకారులు చెప్పుచున్నారు. రాహు మహాదశయొక్క ప్రమాణము 18 సంవత్సరములు. రాహువునకు వృషభము ఉచ్చ, వృశ్చికము నీచ. సింహరాశికూడ స్వక్షేత్రమువంటిదే. మొత్తముమీద రాహువు నైసర్గిక పాపగ్రహముగనే పరిగణింపబడుచున్నాడు.

9. కేతువుయొక్క కారకత్వములు:- అశ్విని, మఖ, మూల నక్షత్రములలో జన్మించినవారికి జననకాల మహాదశ కేతు మహాదశ వచ్చును. కేతుమహాదశయొక్క ప్రమాణము 7 సంవత్సరములు, కేతువు తానున్నరాశి లగాయితు 7-వ రాశిని, అందున్న గ్రహములనుకూడ చూచుచుండును. కేతువు మ్లేచ్ఛగ్రహము.

రాహు కేతువుల రాశ్యాధిపత్య విషయములలో జ్యోతిష శాస్త్రకారకులగు వరాహమిహిర, కాళిదాసు మొదలైనవారు వేరువేరు అభిప్రాయములు వెల్లడించిరి. రాహుకేతువులు ఛాయాగ్రహములగుటచే ప్రత్యేక ఆధిపత్యములు లేక పోయినను వృద్ధపారాశర్యమతము ననుసరించి సూర్యచంద్ర

రాసులగు సింహ కర్కాటకములు రాహువునకు ఉచ్చగను, స్వ క్షేత్రములుగను నున్నవి. కేతువునకు మకర, కుంభములు స్వ క్షేత్రములుగను ఉచ్చగను పరిగణింపవలయును.

రాహు కేతువులు ఎల్లప్పుడు ఒకరికొకరు సప్తమము నందుందురు. వీరు అపసవ్యముగ నడచుచుందురు. అనగా మేషమునుండి మీనమునకును, మీనమునుండి కుంభమునకును నడచుచుందురు.

పూర్ణచంద్ర, గురు, శని కేతువులకు ఆచ్ఛాదనదృష్టి గలదు. వీరు తాముండు రాశికి రెండవయిల్లును, పండ్రెండవయిల్లును ఆచ్ఛాదనాదృష్టిచే చూచుచుందురు. కేతువునకు వృశ్చికము స్వ క్షేత్రమువంటిదని కొందరు తెలిపిరి. కేతువు సత్వగుణుడు, తమోగుణుడని కొందరు వ్రాసిరి. కేతువు స్త్రీగ్రహమని కొందరును, నపుంసక గ్రహమని కొందరును తెలిపిరి. నైసర్గిక పాపగ్రహము.

పితామహ, మోక్ష, గంగాస్నాన, మంత్రశాస్త్ర, వ్రణ, స్ఫోటక, శత్రుపీడ, ఋణపీడ, బహుధాన్య, చిత్రవర్ణ, చిత్రరూప, చిత్రవస్త్ర, గణపత్యుపాస, సన్యాసి, యోగాభ్యాస వేదాంతగోష్ఠి, మత, భిక్షాటన, క్షయ, తీర్థాటన, భిక్షాటనజ్ఞాన, చిత్రవస్తువులకు కేతువు కారకుడగుచున్నాడు. ఉలవల యందు ప్రీతిగలవాడు.

## గ్రహములకు ప్రీతిదానములు

గోచారవశంబునగాని, జాతకరీత్యాగాని, అష్టకవర్గునందు గాని, గ్రహములు దుష్టఫలప్రదులైనచో యాగ్రహములకు జపముచేతను, దానముచేతను శాంతిచేసినచో ఆ దోషము నశించి శుభఫలములు కలుగును.

1. రవికి:- మాణిక్య, గోధూమ, ధేను, రక్తవస్త్ర, గుఢ, హేమ, తామ్ర, రక్తచందన, కమలానిరవేః ప్రీత్యర్థం దేయానిః.

తా. సూర్యుడు పాపఫలప్రదుడైనచో ఆ దోషశాంతికి మాణిక్యము, గోవు, గోధుమలు, రాగి, బెల్లము, పద్మము, చందనము, రక్తవర్ణముగల వస్త్రములు ఆదివారము ఉదయము దానమీయవలయును. రవికి జపసంఖ్య ఆఱువేలు.

2. చంద్రునకు:- వంశపాత్రస్థ తండుల కర్పూర మౌక్తిక శ్వేతవస్త్ర ఘృతకుంభ వృషభౌ శ్చంద్రస్య.

తా. చంద్రగ్రహదోషశాంతికై ముత్యములు, పంచదార, రాగి, వెదురుబియ్యము, వెండి, శంఖము, కర్పూరము, తెల్లని వస్త్రములు, గోమిథునము, మంచినీటితో కుండయు, నెయ్యి దానమీయవలయును. చంద్రునకు జపసంఖ్య పదివేలు.

3. కుజునకు:- ప్రవాళగోధూమ మసూరికా రక్త వృషభ గుఢ సువర్ణ రక్తవస్త్ర తామ్రాణి భౌమస్య.

తా. కుజుడు పాపఫలప్రదుడైనచో ప్రవాళము, బంగారము, కందులు, ఎరుపురంగుగల వస్త్రములు, రాగి, బెల్లము, ఎరుపురంగుగల వృషభము, గోధుములు, గన్నేరు పూవులు దానమీయవలయును. కుజునకు జపసంఖ్య ఏడువేలు.

4. బుధునకు:- నీలవస్త్ర సువర్ణ కాంస్య ముద్గగారుత్మక దాసీ హస్తి దంత బుధస్య ప్రీత్యర్థం దేయాని.

తా. బుధశాంతికై నీలవర్ణముగల వస్త్రము, బంగారము, ఏనుగుయొక్క దంతము, గారుత్మకమణి, పెసలు, నెయ్యి, దుత్తూర పుష్పములను దానమీయవలయును.

5. గురునకు:- పుష్యరాగమణి హరిద్రాశర్కరాశ్వపీత ధాన్య పీతవస్త్ర లవణ సువర్ణాని సురగురోః.

తా. గురుడు దోషఫలప్రదుడైయున్నచో పచ్చనిగుఱ్ఱమును, పంచదారను, బంగారమును, పసుపుపచ్చని ధాన్యమును, పచ్చనివస్త్రములను, లవణమును, శెనగలు, పుష్యరాగమణిని దానమీయవలయును.

6. శుక్రునకు:- చిత్రవస్త్ర శ్వేతాశ్వ ధేను వజ్రమణి సువర్ణ రజిత గంధ తండులా శ్శుక్రస్య ప్రీత్యర్థం దేయాని.

తా. శుక్రుడు పాపస్థానములయందున్నచో ధనుస్సును, వివిధరంగుల వస్త్రమును, నెయ్యి, తెల్లని గుఱ్ఱము, బంగారము, వెండి, గంధము, బియ్యము, వజ్రము, బొబ్బర్లు దానమీయవలయును.

7. శనికి:- ఇంద్రనీల మాషతైల తిలకుళుత్థ మహిషీ కృష్ణ ఛాగ ధేను లోహాశ్శనిః ప్రీత్యర్థం దేయాని.

తా. శని దుష్టస్థానములయందున్నచో నువ్వులను, నూనెను, మినుములు, ఇంద్రనీలమాణిక్యము, నల్లని రంగు గలవస్త్రము, నల్లనిగోవును, నలుపురంగుగల మహిషమును, సువర్ణమును, ఇనుమును దానమీయవలయును.

8. రాహువునకు:- గోమేధాశ్వ నీలవస్త్ర కంబళ తైల తిల లోహాని రాహోః.

తా. రాహువునకు గోమేధికమును, నల్లని గుఱ్ఱమును, నీల వస్త్రమును, కంబళము, ఇనుము, శస్త్రము, ఛాగము, వైఢూర్యము, సువర్ణము, తిలలు, తైలము, మినుములు దానమొసంగవలయును.

9. కేతువునకు:- వైఢూర్య తైల తిల కంబళ కస్తూరీ ఛాగవస్త్రాణి కేతోః.

తా. కేతువునకు కస్తూరియు, కంబళమును, ఛాగము, వైఢూర్యము, తిలలు, తైలము, శస్త్రము, ఉలవలు దానము చేయవలయును.

చంద్రునకు సోమవారమునను, కుజునకు మంగళ వారమునను, బుధునకు బుధవారమునను, గురునకు గురు వారమునను, శుక్రునకు శుక్రవారమునను, శనికి శనివారము నను ఉత్తముడైన బ్రాహ్మణునకు దానమీయవలయును.

మంత్రార్వణము మొదలగు వానిని తెలుసుకొనువిధానము

శ్లో. ఊర్ధ్వగా సప్తదశ చ రేఖాస్తిర్య క్త్రయం కురు,
ఉక్తక్రమేణ వర్ణాంకా లిఖేత్కోష్ఠేషు షోడశ.

తా. పదునేడు రేఖలను నిడుపుగను -మూడురేఖల నడ్డము గను గీసినయెడల పదునారుగళ్ళుగల చక్రము వచ్చును. ఆచక్రమునందు యీక్రింద చూపబడిన విధముగ అంకెలను, అక్షరములను వేయవలయును. అట్టి చక్రమునందు యీక్రిందతెలుపబడిన విధముగ అంకెలను, అక్షరములను వేయవలయును.

శ్లో. ఏకాగ్ని హరబ్రహ్మద్విసింద్వర్క దశషడ్గజాః,
కళా మను మహాభూత సప్తపక్ష త్రయోదశాః.

తా. 1, 3, 11, 9, 2, 4, 12, 10, 6, 8, 16, 14, 5, 7, 15, 13 అంకెలను వరుసగ చక్రమునందు పై గడులలో వేయవలయును.

శ్లో. అకారాది ళకారాంతం పంచాశచ్చ పునః పునః,
లిఖే దేకాగ్ని రిత్యేతచ్ఛోక సంఖ్యా క్రమేణ తు.

తా. అకారము లగాయితు ళకారమువరకుగల ఏబది అక్షరములను చక్రమునందు వేయవలయును.

శ్లో. ఇతిక్రమేణాను లిఖ్య తచ్ఛేషం వర్ణక ద్వయం,
త్రయోదశాంక విభ్రాజత్కోష్ఠే చైవ వినిక్షిపేత్.

తా. ఆ విధముగ సంఖ్యలను చక్రమునందువేసి ఆ సంఖ్యల క్రింద అకారము మొదలు ళకారమువరకుగల ఏబదిఅక్షరములను ఒక్కొక్క సంఖ్యక్రింద ఒక్కొక్కఅక్షరము చొప్పున మూడువరుసలలో వరుసగ వేయగా మిగులు రెండు అక్షరములను చివరగడియందు వేయవలయును.

అర్వణచక్రము

| 1 | 3 | 11 | 9 | 2 | 4 | 12 | 10 | 6 | 8 | 16 | 14 | 5 | 7 | 15 | 13 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ<br>క<br>థ | ఆ<br>ఖ<br>ద | ఇ<br>గ<br>ధ | ఈ<br>ఘ<br>న | ఉ<br>ఙ<br>ప | ఊ<br>చ<br>ఫ | ఋ<br>ఛ<br>బ | ౠ<br>జ<br>భ | ఌ<br>ఝ<br>మ | ౡ<br>ఞ<br>య | ఏ<br>ట<br>ర | ఐ<br>క<br>ల | ఓ<br>డ<br>వ | ఔ<br>ఢ<br>శ | అం<br>ణ<br>ష | అః<br>త<br>స<br>హ ళ |

శ్లో. నామజన్మభనామర్క్ష ప్రధమస్థాక్షరం చయత్,
తదాదావిలి ఖేత్సమ్యగర్వణం యస్యతు సత్యతు.

తా. అర్వణము యెవరికి చూడవలయునో వారిజన్మ నక్షత్రము తెలిసియున్నచో జన్మనక్షత్రమునుబట్టియు, జన్మ నక్షత్రము తెలియనప్పుడు నామనక్షత్రముయొక్క మొదటి యక్షరము లగాయితు, పైనచూపబడిన చక్రమునందలి అక్షరముల వరుసలో అన్నిఅక్షరములను నొకదాని తరువాత యొకటి వరుసగ వ్రాయవలయును. "అంజయ్య" యను పేరుయొక్క మొదటి యక్షరమగు "అ" కారము మొదలుకొని వరుసగగల అక్షరములను వ్రాసినచో స, హ, ళ, అను అక్షరములు కడపటి యక్షరములగును. "రాములు" అను పేరునందలి మొదటి రకారమును మొదలుపెట్టి ఆ విధముగనే వ్రాసినచో భ, మ, య, అను అక్షరములు కడపటి యక్షరములగును. ఈ విధముగనే అన్ని పేర్లకును చూడ వలయును.

శ్లో. త్రింశద్వత్సరవయసాం జన్మభాద్వక్ష్యతేర్వణం,
ఊర్ధ్వంతు నామనక్షత్రాత్కేచిన్నామ్న స్సదా విదుః.

తా. ముప్పది సంవత్సరముల వయసువరకు జన్మ నక్షత్రముయొక్క మొదటి అక్షరమునుబట్టియు, తరువాత నామనక్షత్రముయొక్క మొదటి అక్షరమును బట్టియు

అచ్చుబాటు అర్వణము చూడవలయును. అర్వణమును ఎల్లప్పుడు నామనక్షత్రముయొక్క మొదటి అక్షరమును బట్టియే చూచుచుండవలయునని కొందరు ఋషులు చెప్పిరి.

## సిద్ధార్వణ చక్రము

శ్లో. ఊర్ధ్వగాః పంచరేఖాశ్చ తిర్యగ్రేఖా స్తథా కురు,
కోష్ఠకా షోడశాభూవన్ తేషు వర్ణాంక లేఖనం.

తా. అయిదు రేఖలను క్రిందనుంచి పైకిగీసి ఆరేఖలమీద అడ్డముగ అయిదురేఖలను గీసినచో పదియారుగడులు గల చక్రము ఏర్పడును. ఆ గడులలో యీక్రింద తెలుపబడు విధముగ అంకెలను, అక్షరములను వేయవలయును.

శ్లో. వామభాగే సమారభ్య దక్షిణాంతం పునః పునః,
ఏకం ద్వే త్రీణి చేత్వారి సంఖ్యా షోడశ సంలిఖేత్.

తా. ఎడమభాగమునుండి ప్రారంభించి ఒకటి మొదలు పదియారువరకు సంఖ్యలను క్రమముగ పదునారు గడుల యందును వేయవలయును.

శ్లో. చంద్రా క్షీరస బాణశ్చ త్రిచతుర్వసు పర్వతాః,
రుద్రాదిత్య కళా పక్షాః నవదిఙ్మయ విశ్వకాః.

ఉదా. 1, 2, 6, 5, -- 3, 4, 8, 7, -- 11, 12, 16, 15- 9, 10, 14, 13 ను ------ యీఅంకెలు చక్రమునకు నాలుగేసి గడులు చొప్పున చౌకముగ సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అరి అను నాలుగు చక్రములు వచ్చును.

సిద్ధచక్రము.

| | | | |
|---|---|---|---|
| 1<br>అ, క, ధ<br>సిద్ధః. | 2<br>ఉ, ఙ, ప<br>సాధ్యం. | 3<br>ఆ, ఖ, ద<br>సిద్ధః. | 4<br>ఊ, చ, ఫ<br>సాధ్యః. |
| 5<br>ఓ, డ, వ<br>అరిః. | 6<br>, ఝ, మ<br>సుసిద్ధః. | 7<br>ఔ, ఢ, శ<br>అరిః. | 8<br>, ఞ, య<br>సుసిద్ధః |
| 9<br>ఈ, ఘ, న<br>సిద్ధః. | 10<br>ఋ , ఙ, భ<br>సాధ్యః. | 11<br>ఇ, గ, థ<br>సిద్ధం. | 12<br>ౠ, ఛ, బ<br>సాధ్యః. |
| 13<br>అః, త, స<br>అరిః. | 14<br>ఐ, ర, ల<br>సుసిద్ధః. | 15<br>అం, ఞ, ష<br>అరిః. | 16<br>ఏ, ట, ర<br>సుసిద్ధః. |

సాధ్యచక్రము

అరిచక్రము

సుసిద్ధచక్రము

దాంపత్యము, కృతి, భూమి, గృహము, దేశము, గ్రామము, గురువు, భూపతి, మంత్రమునదేవత వీనిని గురించి అర్వణచక్రమున చూడవలయును.

ఏవ్యక్తియొక్క జన్మ లేక నామ నక్షత్రమును ననుసరించి చక్రమువేయబడినదో యాచక్రమున వారికిష్టమైనవారికి యిష్టమగు మంత్రముయొక్క మొదటియక్షరము ఏగడియలో నుండునో, ఆగడినిబట్టి ఫలితములు గ్రహించవలయును.

సిద్ధార్వణచక్ర ఫలిత నిరూపణ

సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అను మూడుచక్రములలో సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అను తొమ్మిదిగడులలో నేగడియందైనను, మంత్రముయొక్క మొదటి అక్షరమున్నచో అర్వణము శుభము. పై చక్రములయొక్క అరిగళ్ల మూడింటియందును, అరిచక్రములో నాలుగుగడులయందును దేనియందైనను నున్నచో అశుభకరము. సిద్ధము కొన్ని సమయములయందు సిద్ధించును. సాధ్యము జపము మొదలగువాటివలన సిద్ధించును. అరి మూలమును పాడుచేయును.

కృతి, దుర్గము, పురము, గృహము, ఔషధము, మంత్రము, దైవము, భూపతి, ధనలాభముల విషయములలో అరిని విడువవలయును.

స్వప్న, దైవ, స్త్రీ, గురు, పితృ, మాతృ దత్తములు, పీఠ త్రయమంత్రములు, పంచ ప్రణవ బీజయుక్తములు, సపిండాక్షర సంజ్ఞలతో కూడిన మంత్రములు, వీటికి అర్వణము చూడకూడదు.

అర్వణము చూడదలచిన జన్మ లేక నామనక్షత్రము యొక్క మొదటి యక్షరము ఆచక్రమున సిద్ధ, సాధ్య, సుసిద్ధ, చక్రములలో అరిగళ్లు మూడింటియందును, అరిచక్రములో నాలుగు గళ్లయందును యున్నచో అరిష్టము, మిగిలిన తొమ్మిది గడులలో నున్నయెడల శుభకరము.

## ప్రకారాంతముగ అర్వణచక్రము

పొడవుగ నాలుగు రేఖలనుగీచి, ఆరేఖలమీద పంౘ్రెండు గడులు ఏర్పడునట్లు ఐదు అడ్డరేఖలను గీయవలయును. ఆ గడులయందు యీక్రింద తెలుపబడిన విధముగచేసి, వచ్చు శేషములనుబట్టి ఫలితములను తెలుసుకొనవలయును.

| | | | | |
|---|---|---|---|---|
| సిద్ధాః | 1 | 5 | 9 | బాంధవాః |
| సాధ్యాః | 2 | 6 | 10 | సేవకాః |
| సుసిద్ధాః | 3 | 7 | 11 | పోషకాః |
| అరయః | 4 | 8 | 12 | ఘాతుకాః. |

అర్వణము తెలుసుకొనవలసిన వారిపేరునందలి అక్షర సంఖ్యను మూడుచే మంత్రాక్షరములను కలిపి 12చే భాగించగా వచ్చు శేషమునుబట్టి ఫలితములను తెలుసు కొనవలయును.

శేషము 1, 5, 9 వచ్చినచో ఆమంత్రము సిద్ధించి స్నేహితునివంటి దగును. 2, 5, 12 వచ్చినచో సిద్ధించి సేవకునివంటి దగును. 3, 7, 10 వచ్చినయెడల సిద్ధించి రక్షకునివంటి దగును. 4, 8, 12 వచ్చినయెడల శత్రువునివంటి దగును.

అర్వాణము చూడవలసినవారి పేరునందలి అక్షరముల సంఖ్యను 3చే గుణించి ప్రశ్నయందలి వృత్తి, భూమి, గృహముల పేరులలో నుండు అక్షరసంఖ్యను కలిపి 12చే భాగించి నచో శేషము 4, 8, 10 వచ్చినయెడల అనుకూలమును, మిగిలినసంఖ్యలు వచ్చిన ప్రతికూలమును జరుగును.

## మంత్రోపదేశమునకు శుభకరములైనవి

చైత్ర, వైశాఖ, శ్రావణ, ఆశ్వీయుజ, కార్తీక, మార్గశిర, మాఘ, ఫాల్గుణ మాసములలో రెండు పక్షములందును, 2, 3, 5, 7, 10 తిథులును, శుక్ల 13ను, సోమ, బుధ, గురు, శుక్రవారములును, రోహిణి, మృగశిర, పుష్యమి, శ్రవణము, అశ్విని, రేవతి, ఉత్తరఫల్గునీ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శతభిష నక్షత్రములు మంత్రోపదేశమునకు శుభకరములైనవి. అధికమాసములును,

జ్యేష్ఠ, ఆషాఢ, భాద్రపద పుష్య మాసములును, ఆది, మంగళ శనివారములును పనికిరావు.

మేష, కర్కాటక, తుల, మకర, లగ్నములు శైవ మంత్రములకును, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ లగ్నములు వైష్ణవమంత్రములకును మిథున, కన్యా, ధనుర్మీనములు, శాక్తేయ మంత్రములకును శుభకరములైనవి.

అర్వణచక్రము

| | | | |
|---|---|---|---|
| 1<br>ఏ, ట, ర | 2<br>అం, ణ, ష | 3<br>ఐ, ఠ, ల | 4<br>అః, త, స |
| 5<br>ఛ, బ, ఉ | 6<br>గ, ధ, అ | 7<br>జ, భ, ఊ | 8<br>ఘ, న, ఆ |
| 9<br>ఔ, ధ, శ | 10<br>ఖ, ద, ళ | 11<br>ఓ, డ, వ | 12<br>క, థ, హ |
| 13<br>ఞ, య,<br>ౠ, ౡ | 14<br>చ, ఫ, ఈ | 15<br>ఝ, మ, ఋ | 16<br>జ, ప, ఇ |

## సిద్ధారి చక్రములు

| | | | |
|---|---|---|---|
| 1<br>అ, క, థ | 5<br>ఉ, ఙ, ప | 2<br>ఆ, ఖ, ద | 6<br>ఊ, చ, ఫ |
| 13<br>ఓ, డ, వ,<br>హ, ళ | 9<br>ఌ , ఝ, మ | 14<br>ఔ, ఢ, శ | 10<br>ౡ, ఞ, య |
| 4<br>ఈ, ఘ, న | 8<br>ౠ, జ, భ | 3<br>ఇ, గ, ధ | 7<br>ఋ, ఛ, బ |
| 16<br>అః, త, స | 12<br>ఐ, ఠ, ల | 15<br>అం, ణ, ష | 11<br>ఏ, ట, ర |

## వేరొక విధము

| | | | |
|---|---|---|---|
| 1<br>అ, క, థ | 2<br>ఉ, ఙ, ప | 5<br>ఓ, డ, వ | 6<br>ఌ, ఝ, మ |
| 4<br>ఊ, చ, ఫ, | 3<br>ఆ, ఖ, ద | 8<br>ౡ, ఞ, య | 7<br>ఔ, ఢ, శ |
| 13<br>అః, త, స,<br>హ, ళ | 14<br>ఐ , ఠ, ల | 9<br>ఈ, ఘ, న | 10<br>ౠ, జ, భ |
| 16<br>ఏ, ట, ర | 15<br>అం, ణ, ష | 12<br>ఋ, ఛ, బ | 11<br>ఇ, గ, ధ |

మరియొక విధము:-

1. అ, ఉ, , ఒ, క, జ, ఝ, డ, ధ, ప, మ, వ, హ.

2. ఆ, ఊ, , ఔ, ఖ, చ, ఞ, ఢ, ద, ఫ, య, శ, ళ.

3. ఇ, ఋ, ఎ, అం, గ, ఛ, ట, ణ, ధ, బ, ర, ష.

4. ఈ, ౠ , ఐ, అం, ఘ, జ, ఠ, త, న, భ, ల, స.

## శనిదోష పరిహారమునకు

శనివారము ఉదయము తైలాభ్యంగనముచేసి తిలలు, తైలాదిదానములు గావించి నెయ్యి, నూనె, ఆముదము వీటి యందు ఎఱుపు, తెలుపు, నలుపు, కలిపిన వత్తివేసి, పడమటి దిక్కులో, ఇనుపగరిటెలో శనిదీపమును పెట్టవలయును. శని దోషమేగాక సకల కష్టములును పరిహారమగును.

## శని వ్రతము

శని ప్రతిమను ఇనుముతో చేయించవలయును. మట్టితో చేయబడిన కుండలోగాని ఇనుముతో చేయబడిన పాత్ర యందుగాని ఆ శని ప్రతిమనుంచి నల్లనివస్త్రముగాని, కంబళముగాని ఆ పాత్రమీదవేసి, తిలలు, నల్లనిపుష్పములు, నల్లనిగంధము, మొదలగు నలుపురంగుగల వానితో పూజించి, నల్లనిబ్రాహ్మణునకుగాని నలుపురంగుగల శూద్రునకుగాని బంగారముతో సహితముగ దానమీయవలయును. మరియు

పులగము, తిలలుకలిపిన అన్నమునుకూడ దానమీయ వలయును. ఈవిధముగ చేసినచో ఏలినాటి శనివలన కలుగు దోషములు పరిహారమగును

## శనిస్తోత్రము.

శ్లో. కోణస్థో పింగళో బభ్రుః కృష్ణో రౌద్రాంతకో యమః,
సౌరి శనైశ్చరో మందః పిప్పలాదేన సంస్తుతః.

శ్లో. నమస్తే కోణసంస్థాయ పింగళాయ నమోస్తుతే,
నమస్తే బభ్రురూపాయ కృష్ణాయ చ నమోస్తుతే,
నమస్తే రౌద్రదేహాయ నమస్తే బాంతకాయ చ,
నమస్తే యమసంజ్ఞాయ నమస్తే సౌరయే విభోః.
నమస్తే యమసంజ్ఞాయ శనైశ్చర నమోస్తుతే,
ప్రసాదం మమ దేవేశ దీనస్య ప్రణతస్య చ.

అని యీావిధముగ ప్రతిదినమును . ప్రాతఃకాలమునందు పఠించినచో ఏలినాటి శనివలన కలుగు సర్వకష్టములు తొలగి శుభము కలుగును.

ప్రతిఆదివారము ఉదయము సూర్యనమస్కారములును, సూర్యమంత్రజపమును, సూర్యపూజయు, అశ్వత్థ ప్రదక్షిణము లును చేసినచో సర్వరోగములు తొలగి మంచి ఆరోగ్యము లభించును. ప్రతిఆదివారము ఉదయము గోవును పూజించుట వలన అనేక శుభములు కలుగును.

## సంవత్సరఫలితమును తెలుసుకొను విధానము

శ్లో. చైత్రాది తిధివారాణాం కరణం యోగతారకం,
జన్మనక్షత్ర సంయుక్తం సప్తభిర్భాగమాహరేత్.

శ్లో. అర్థలాభం మనస్తాపం రాజమాన్యం చ యుద్ధతః,
భూషణం రోగమాయుష్యమేవం వర్షఫలం స్మృతమ్.

తా. చైత్రశుద్ధ పాడ్యమిదినమున నుండు తిధి, వార, నక్షత్ర, యోగ, కరణముల సంఖ్యలను కలిపి మొత్తము చేయవలయును. ఆ మొత్తమునకు అశ్విని లగాయితు జన్మ నక్షత్రమువరకు లెక్కపెట్టగా వచ్చు సంఖ్యను కలియకూడి 7చే భాగించగా 1 శేషమువచ్చిన ధనలాభమును, 2 వచ్చిన విచారమును, 3 వచ్చిన రాజసన్మానమును, 4 వచ్చిన కలహము, 5 వచ్చిన అలంకారము, 6 వచ్చిన రోగము కలుగును. ఏమియు శేషమురానిచో ఆరోగ్యమని యెరుంగ వలయును.

### మాస ఫలితము

శ్లో. జన్మనక్షత్రమారభ్య మాసభాంతం ప్రగణ్యతే,
గుణిత్వా సప్తభిశ్శేషం విధిసంఖ్యా హరేణ చ.
రవిస్సౌమ్యే ఫణిర్జీవః కేతుశ్చంద్రో శనిర్భృగుః,
భూమిపుత్రేతి నవ చ మాసాధిపతయః క్రమాత్.

తా. జన్మనక్షత్రము మొదలు ఏమాసమునకు ఫలితము చూడవలయునో ఆ మాసముయొక్క శుక్లపాడ్యమి దినమున నుండు నక్షత్రమువరకు లెక్కపెట్టగా వచ్చిన సంఖ్యను 7చే గుణించి 9చే భాగించగా శేషము 1 వచ్చిన మాసాధిపతి సూర్యుడు అగును. 2 మిగిలిన బుధుడు, 3 మిగిలిన రాహువు, 4 మిగిలిన గురుడు, 5 మిగిలిన కేతువు, 6 మిగిలిన చంద్రుడు, 7 మిగిలిన శని, 8 మిగిలిన శుక్రుడును, 9 మిగిలిన కుజుడును అగుదురు.

1. సూర్యుడు:- మాసాధిపతియైన కోపము, ప్రయాణము, విచారము, శిరోవ్యాధి, భయము, రాజదండనాదిభయములు కలుగును.

2. చంద్రుడు:- మాసాధిపతియైన దధియుక్తభోజనమును, సౌఖ్యమును, స్త్రీ సౌఖ్యమును, ప్రేమయు, ధనలాభమును, ఆనందమును కలుగును.

3. కుజుడు:- మాసాధిపతియైన కలహమును, రాజదండనాది భయములును, కార్యవిఫలమును, విచారమును కలుగును.

4. బుధుడు:- మాసాధిపతియైన బంధుమిత్రులతో కలసి సుఖముగ జీవించుటయు, దైవభక్తియు, విద్యావంతులతో పరిచయమును, ధనలాభమును కలుగును.

5. గురుడు:- మాసాధిపతియైనచో, ధనలాభమును, గురువులయందు భక్తిశ్రద్ధలు కలిగి ప్రవర్తించుటయు, భార్యకు అలంకారప్రాప్తియు, జ్ఞానాభివృద్ధియు, సౌఖ్యమును కలుగును.

6. శుక్రుడు:- మాసాధిపతియైనచో స్త్రీసౌఖ్యమును, ధన లాభమును, శయ్యాభోగమును, సుగంధద్రవ్యలాభమును, ధన లాభమును, గోలాభమును, మధుర రసపానమును కలుగును.

7. శని:- మాసాధిపతి యగుటవలన ఉదరరోగములును, వృధాకలహ కారణములు కలుగుటయు, శత్రువులవలన బాధయు, మలినవస్త్రములు ధరించుటయు, క్రూరమృగముల వలన భయమును కలుగును.

8. రాహువు:- మాసాధిపతియైనప్పుడు, ఉదరమునకు సంబంధించిన అనారోగ్యములును, కలహములును, ధన నష్టమును, భోజనసౌఖ్యము లేకపోవుటయు, త్రిప్పటయు చోరులవలన భయమును కలుగును.

9. కేతువు:- మాసాధిపతియైనచో ఉద్యోగమునకు సంబంధించిన విషయములలోగాని చేయువృత్తియందుగాని చిక్కులు సంభవించుటయు, విషజంతువులవలన భయమును, కలహమును, బంధుమిత్రప్రజావిరోధమును, నీచస్త్రీలతో కలహమును సంభవించును.

## గ్రహములకు ఆధిపత్య దేశవిభజనము

సూర్యునకు:- భూచక్రాధిపత్యమంతయు చెప్పబడినది.

చంద్రునకు:- కావేరి తామ్రపర్ణుల మధ్యప్రదేశము.

కుజునకు:- కృష్ణానదీ లంక మధ్యప్రదేశము.

శుక్రునకు:- కృష్ణా గోదావరీ మధ్యప్రదేశము.

గురునకు:- వింధ్యప్రదేశమునకు పడమరభాగము.

బుధునకు:- గంగానదీ దక్షిణప్రదేశము.

రాహుకేతువులు:- వింధ్యప్రదేశమునకు పడమరభాగము.

శనికి:- హిమవత్పర్వతముల భాగము. దక్షిణదేశము.
గోదావరికి పశ్చిమదేశము.

## నక్షత్రములకు జాతిభేదములు

బ్రాహ్మణజాతి:- కృత్తిక, పుబ్బ, పూర్వాషాఢ, పునర్వసు,
పూర్వాభాద్రా నక్షత్రములు.

క్షత్రియజాతి:- మృగశిర, పుష్యమి, చిత్త, అనూరాధ,
రేవతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు.

వైశ్యజాతి:- భరణి, ధనిష్ఠ; స్వాతి, మఖ, హస్తలు.

శూద్రజాతి:- రోహిణి, అశ్విని, ఆర్ద్ర, మూల, శతభిషము.

చండాలజాతి:- విశాఖ, శ్రవణ, ఆశ్లేష, జ్యేష్ఠ.

## గ్రహములకు జన్మదేశములు

సూర్యునకు కళింగదేశము, చంద్రకుజులకు యవన దేశము, గురునకు సింధుదేశము, శుక్రునకు మహారాష్ట్రము, రాహుంకేతువులకు బర్బర, శనికి యవంతి, బుధునకు సౌరాష్ట్రమును జన్మదేశములు.

## దేశములకు జన్మనక్షత్రములు

1. కళింగమునకు కృత్తికయు, 2. కాశ్మీరమునకు రోహిణి, 3. వంగదేశమునకు మృగశిర, 4. బాహ్లీకమునకు ఆరుద్ర, 5. మహారాష్ట్రమునకు పునర్వసు, 6. వింధ్యదేశమునకు పుష్యమి, 7. మత్స్యదేశమునకు ఆశ్లేష, 8. పార్థివ దేశమునకు మఖ, 9. అంగదేశమునకు పుబ్బ, 10. పాటలము నకు ఉత్తర, 11. మిధిలకు హస్త, 12. వింధ్య దక్షిణ దేశమునకు చిత్త, 13. సౌరాష్ట్రమునకు స్వాతి, 14. విదర్భకు విశాఖ, 15. సౌరాష్ట్రమునకు ఉత్తరప్రదేశమునకు అనూరాధ, 16. పాంచాలమునకు జ్యేష్ఠ, 17. ఉత్కలమునకు మూల, 18. దర్దురదేశమునకు పూర్వాషాఢ, 19. కాంభోజమునకు ఉత్తరాషాఢ, 20. విదేహమునకు శ్రవణము, 21. సూరసేన దేశమునకు ధనిష్ఠ, 22. మాగధమునకు శతభిషము,

23. కురుభద్ర దేశమునకు పూర్వాభాద్ర, 24. పర్వత ప్రదేశములకు ఉత్తరాభాద్ర, 25. ఆంధ్రదేశమునకు రేవతి, 26. ప్రపంచమున కంతటికిని అశ్విని, 27. తాలపూర్ణ దేశమునకు భరణియు నక్షత్రములుగ చెప్పబడినవి. దేశముల శుభాశుభ స్థితిగతులు గ్రహముల చేష్టాగత్యనుసరణములు. గ్రహములయొక్క చేష్టాభేదములే నక్షత్రములకు వేధలగును. వీనినిబట్టియే శుభాశుభఫలితములు చెప్పవలయును. గ్రహ దోషముగాని, నక్షత్రదోషముగాని యిందు తెలుపబడిన దేశమునకే చెప్పవలయును. అన్యదేశములకు వర్తించవని వరాహమిహిర, పరాశరాది మునులు తెల్పిరి.

దేశములకుగాని వస్తువులకుగాని పేరుయొక్క మొదటి అక్షరమునుబట్టి సకలవేధలు గుర్తించి, దేశములకు యోగ క్షేమములును, వస్తువుల ధరలను నిర్ణయింపవలయును. క్రూరగ్రహవేధగల వస్తువులు నశించును. శుభగ్రహదృష్టి, వేధలుగల వస్తువులు విశేషముగ ఫలించును. అనగా వస్తు నాశము గలిగినప్పుడు ధర హెచ్చును. బాగుగ ఫలించిన వస్తువు చౌకయగును. భరణి నక్షత్రములో పాపగ్రహ మున్నచో తక్కెడతో తూచబడు పదార్థములు విశేషధరలు కలిగియుండును.

## దేశములకు అరిష్టయోగములు

దేశములకు అధిపతులని చెప్పబడిన గ్రహములు పాపులయినను, అస్తంగతులైనను, యుద్ధమునందు పరాజితులైనను, పాపగ్రహసంబంధము కలిగియున్నను, దేశముల నక్షత్రములను పాపగ్రహములు వేధించినను కూడినను, ఆయాదేశములకు అరిష్టము, అశనిపాత, ఉల్కాపాత, శిలావర్ష, సస్యనాశన, ప్రజాపీడలు కలుగును. అట్టి దోషములు పట్టినగ్రహములతో చంద్రుడు పూర్ణుడై పాపులచే వేధింపబడి వారితో నేదినమున గలియునో ఆ దినమున ఆ ప్రదేశమున పైన వ్రాయబడిన అరిష్టములు సంభవించును. గాలివాన మొదలగునవికూడ కలుగును. బుద్ధిశాలురు గ్రహగతి పెక్కు రీతులుగ పరిశీలించి తత్కాలబల శుభాశుభత్వంబుల గనిపెట్టి బాగుగ ఆలోచించి చెప్పవలయును.

క్రూరగ్రహదృష్టి, వేధ కలిగిన నక్షత్రములుగల దేశములలో ప్రజాపీడయు, దుర్భిక్షము, యుద్ధభయము కలుగును.

ఈ విధముగ దేశనక్షత్రములకు పాపగ్రహవేధలను బట్టియు, పాపగ్రహదృష్టులనుబట్టియు నాదేశములకు కీడనియు, శుభగ్రహదృష్టివేధలనుబట్టి శుభమనియు చెప్పవలయును.

పైన తెలుపబడిన జాతినక్షత్రమును వేధించు శుభాశుభుల వల్ల నాయాజాతులవారికి అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర చండాల జాతులవారికి క్రమముగ శుభాశుభ ఫలితములను చెప్పవలయును.

## సంక్రాంతి ఫలము తెలుసుకొను విధానము

శ్లో. జన్మతారాది సంక్రాంతి కాలభాంతం ప్రగుణ్యతే
సప్తభిర్గుణితం కృత్వా భాజితం వసుసంఖ్యయా
తచ్ఛేషణ ఫలాన్యాహుం సంక్రాతేశ్చ మనీషిణః
రోగో లాభం తథా ధ్యానం బంధనం ధనమేవచ
ఐశ్వర్య మర్థలాభంచ నృపపీడా యథాక్రమమ్.

తా. జన్మనక్షత్రము లగాయితు సంక్రమణ ప్రవేశ కాలమునకుండు నక్షత్రమును లెక్కపెట్టి వచ్చుసంఖ్యను 7 చే గుణించి 8చే భాగించగా శేషము 1 వచ్చిన రోగము, 2 వచ్చిన లాభము, 3 వచ్చిన త్రిప్పటయు, 4 వచ్చిన కారాగృహమును, 5 వచ్చిన ధనమును, 6 వచ్చిన సంపదయు, 7 వచ్చిన ధనప్రాప్తియు, 8 వచ్చిన ప్రభుమూలక భయములను కలుగజేయును.

## చంద్రోదయ నక్షత్రఫలితవములు

శ్లో. చంద్రోదయాద్యతారాది జన్మభాంతం చ గణ్యతే
నవసంఖ్యా హరేచ్ఛేషం సుమ్యజ్జిక్షిప్య యోజయేత్
చక్రం షణ్కోణసంయుక్తం లిఖిత్వాస్మిన్ క్రమేణ తు
ఏకం ద్విః పునరేకం చ ద్విరేకం యుగ్మసంఖ్యయా
పంధా లాభో వ్యధా వస్త్రం దాహం చ విపులం ధనమ్.

తా. చంద్రుడు ఉదయించిన నక్షత్రము లగాయితు జన్మ నక్షత్రమువరకు లెక్కపెట్టి, వచ్చుసంఖ్యను 9చే భాగింపగా వచ్చు శేషమును ఆఱురేఖలుగల చక్రములో ఒకటి రెండు వరుసగా తూర్పుదిక్కున మొదలుపెట్టి వేయవలయును. అట్టి చక్రములో ఒకటి ప్రయాణమును, రెండవ రేఖయందుండు రెండు లాభమును, మూడవరేఖయందుండు ఒకటి విచారమును, నాల్గవరేఖయందుండు రెండు నూతనవస్త్రలాభమును, అయిదవరేఖయందుండు ఒకటి శరీర శ్రమను, ఆఱవరేఖయందుండు రెండు విశేషధనలాభమును కలుగజేయును.

## శుక్లపక్ష ప్రవేశ నక్షత్రఫలవము

శ్లో. శుక్లాది తిథిమారభ్య జన్మభాంతం చ గణ్యతే,
నవసంఖ్యా హరేచ్ఛేషం శుక్ల తారాఫలం స్మృతమ్.

తా. శుక్లపాడ్యమి ప్రవేశమునకు ఏనక్షత్రముండునో ఆ నక్షత్రము లగాయితు జన్మనక్షత్రమువఱకు లెక్కపెట్టి, వచ్చుసంఖ్యను 9చే భాగించగా వచ్చు శేషమునుబట్టి శుక్లపక్షముయొక్క ఫలితములు తెలుసుకొనవలయును.

శ్లో. పంథా సుభోజ్యం తనుతాపశౌర్యే విద్యా చ వస్త్రం,
విపులం చ శోకః అనంతపుణ్యం చ మహాఫలం చ,
సవేతి మానస్య ఫలాని బాహః.

తా. శేషము 1 వచ్చిన ప్రయాణమును, 2 వచ్చిన సౌఖ్య భోజనమును, 3 వచ్చిన దేహాయాసమును, 4 వచ్చిన శౌర్యమును, 5 వచ్చిన విద్యాలాభమును, 6 వచ్చిన నూతన వస్త్రప్రాప్తియు, 7 వచ్చిన అధికవిచారమును, 8 వచ్చిన విశేషపుణ్యమును, 9 వచ్చిన చేయువృత్తియందు విశేష లాభమును కలుగును.

## కృష్ణపక్షప్రవేశ నక్షత్రఫలము

శ్లో. కృష్ణపక్షాద్యతారాది జన్మభాంతం చ గణ్యతే,
త్రీణి సంఖ్యా హరేచ్ఛేషం క్షేమలాభ ప్రయాణకృత్.

తా. కృష్ణపక్షము ఏసమయములో ప్రవేశించునో ఆ సమయమునకుండు నక్షత్రము లగాయితు జన్మనక్షత్రము వరకు లెక్కపెట్టి, వచ్చుసంఖ్యను మూడుచే భాగించగా

ఒకటి మిగిలిన క్షేమమును, రెండు లాభమును, మూడు ప్రయాణమును కలుగజేయును.

## జననకాలమునకు వచ్చుమహాదశల నెరుంగుట

శ్లో. ఇన శశి కుజ రాహుర్జీవ మందాజ్ఞ కేతుః,
భృగుజఇతి నవానాం కృత్తికాది క్రమేణః.

తా. కృత్తిక నక్షత్రముమొదలు జననకాలమునకుండు నక్షత్రమువరకు లెక్కపెట్టగా వచ్చుసంఖ్యను 9చే భాగించగా శేషము 1 వచ్చిన జననకాలమునకు రవిమహాదశయు, 2 మిగిలిన చంద్రమహాదశయు, 3 మిగిలిన కుజమహాదశయు, 4 మిగిలిన రాహుదశయు, 5 మిగిలిన గురుడును, 6 మిగిలిన శనియు, 7 మిగిలిన బుధుడును, 8 మిగిలిన కేతువును, 9 మిగిలిన శుక్రుడును మహాదశాధిపతులగుదురు. అనగా యీక్రింది విధముగ నక్షత్రములకు మహా దశలు ఏర్పడును.

1. కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢలలో జన్మించిన జనన కాలమునకు రవిమహాదశయు.

2. రోహిణి, హస్త, శ్రవణములలో జన్మించిన జనన కాలమునకు చంద్రమహాదశయు.

3. మృగశిర, చిత్త, ధనిష్ఠలలో జన్మించిన జనన కాలమునకు కుజమహాదశయు.

4. ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములలో జన్మించిన జనన కాలమునకు బుధమహాదశయు

5. పునర్వసు, విశాఖ, పూర్వాభాద్రలలో జన్మించిన జననకాలమునకు గురుమహాదశయు.

6. భరణి, పుష్యమి, పూర్వాషాఢలలో జన్మించిన జనన కాలమునకు శుక్రమహాదశయు.

7. అనూరాధ, పుబ్బ, ఉత్తరాభాద్రలకు శనిమహాదశయు.

8. ఆరుద్ర, స్వాతి, శతభిషములలో జన్మించిన జన్మ కాలమునకు రాహుమహాదశయు.

9. అశ్విని, మఖ, మూలలో జన్మించిన జన్మకాలమునకు కేతుదశయు ప్రారంభమగును.

పైనచెప్పినవిధముగ ఏదశానాధుని నక్షత్రమందు జననము కలుగునో ఆ నక్షత్రదశాధిపతి జాతకునకు ఫలితములు యిచ్చుచుండును.

## మహాదశల ప్రమాణములు

శ్లో. షడ్భానోర్దశ చంద్రస్య సప్తభౌమస్య వత్సరాః,
అష్టాదశ చ రాహుంశ్చ సురాచార్యస్య షోడశ,
ఏకోనవింశతి ర్మందో బుధస్య దశసప్తచ,
కేతోశ్చ సప్త వర్షాణి శుక్రో వింశతి వత్సరాః.

తా. రవిమహాదశయొక్క ప్రమాణము 6 సంవత్సరములు.

| | | | | |
|---|---|---|---|---|
| చంద్ర | " | " | 10 | " |
| కుజ | " | " | 7 | " |
| రాహు | " | " | 18 | " |
| గురు | " | " | 16 | " |
| శని | " | " | 19 | " |
| బుధ | " | " | 17 | " |
| కేతు | " | " | 7 | " |
| శుక్ర | " | " | 20 | " |

## జననకాలమునకు జననకాలమహాదశయొక్క భుక్తి తెలుసు కొనువిధానము

శ్లో. నక్షత్ర భుక్తిఘటికా ఋక్షనా ధేనతాడితాః,
ఋక్షా ద్యద్యంతే స సంఖ్యాజ్యం వర్షమాస దినాదికమ్.

తా. జనన సమయమునకు ఉన్న నక్షత్రము, జనన సమయమునకు ఎంతభుక్తిఅయినదో తెలుసుకొనవలయును. భుక్తిఘడియ లను విఘడియలలోనికి మార్చవలయును. ఆ విఘడియలను ఆ నక్షత్రముయొక్క మహాదశా సంవత్సరము లతో గుణించవలయును. జననకాల నక్షత్రముయొక్క ఋక్ష్యాదంతము అనగా నక్షత్రప్రమాణముచే భాగించగా వచ్చు లబ్దము సంవత్సరములుగా భావింపవలయును. శేషమును 12చే గుణించి ఋక్షాద్యంతముచే భాగించినచో వచ్చు లబ్దమును మాసములుగ భావింపవలయును. మరల ఆ శేషమును మాసదినసంఖ్యయగు 30చే గుణించి ఋక్ష్యా ద్యంతముచే భాగించినచో వచ్చు లబ్దము దినములగును. మరల శేషమును 60చే గుణించి ఋక్ష్యాద్యంతముచే భాగించినచో లబ్దము ఘడియలగును. మరల శేషమును 60చే గుణించి ఋక్ష్యాద్యంతముచే భాగించినచో విఘడి యలు వచ్చును. దీనిని అనగా యీవిధముగ చేయగా వచ్చు సంవత్సర మాస దినసంఖ్యలను మహాదశప్రమాణములో తీసివేసినచో జననకాల మహాదశ శేషము వచ్చును.

## అంతర్దశాప్రమాణమును తెలుసుకొను విధానము

శ్లో. మహాదశాంత ద్గుణితాం దశస్థానం తు మాసకం,
ఏకస్థానం త్రిగుణితం దినాన్యంతర్దశా స్మృతాః.

తా. దశానాథుని సంవత్సరసంఖ్యను అంతర్దశానాథుని దశాసంవత్సరసంఖ్యచే గుణించవలయును. ఆ విధముగ గుణించగా వచ్చు సంఖ్యలో చివరిసంఖ్యను ఒక్కదానిని మాత్రమే 3చే గుణించినచో దినములు వచ్చును. పదులు, వందల స్థానములలో నున్న సంఖ్యలు మాసములగును ఆ మాసములను సంవత్సరములలోనికి, మాసములలోనికి మార్చవలయును.

ఉదాహరణకు:- గురుమహాదశలో బుధ అంతర్దశ ప్రమాణమును తెలుసుకొను విధానమును తెలుపుచున్నాను.

గురుమహాదశయొక్క ప్రమాణము 16 సం.లు

బుధమహాదశయొక్క ప్రమాణము 17 సం.లు

112

16

272

చివరసంఖ్యయగు 2ను 3చే గుణించినచో 6 వచ్చును. 6 దినములుగ వేసుకొనవలయును. 27 మాసములుగ తీసుకొనవలయును. 27 మాసములనగా 2 సంవత్సరముల 3 మాసములు. అందుచే గురుమహాదశలో బుధ అంతర్దశ ప్రమాణము 2 సంవత్సరముల 3 మాసముల 6 దినములు.

## విదశాప్రమాణములను తెలుసుకొనువిధానము

అంతర్దశా ప్రమాణమును 120చే భాగించి, వచ్చు లబ్దమును ఏగ్రహమునకు విదశాప్రమాణము కావలయునో ఆ విదశానాధుని మహాదశాప్రమాణసంఖ్యచే గుణించిన విదశా ప్రమాణము వచ్చును.

## సూక్ష్మదశాప్రమాణము

విదశా ప్రమాణమును 120చే భాగించి, ఏగ్రహమునకు సూక్ష్మదశాప్రమాణము కావలయునో ఆ గ్రహముయొక్క మహాదశాప్రమాణ సంవత్సరముచే లబ్దమును గుణించిన సూక్ష్మదశాప్రమాణము వచ్చును.

## ప్రాణదశా ప్రమాణము

సూక్ష్మదశాప్రమాణమును 120చే భాగించి, లబ్దమును సూక్ష్మదశానాథుని మహాదశ సంవత్సర ప్రమాణసంఖ్యచే గుణించిన ప్రాణదశాప్రమాణము వచ్చును.

## మహాదశలలో అంతర్దశా ప్రమాణములను తెలుపు పట్టిక

### రాహం

| మహాదశ | రవి అంతర్దశ | చంద్ర అంతర్దశ | కుజ అంతర్దశ | రాహం అంతర్దశ | గురు అంతర్దశ | శని అంతర్దశ | బుధ అంతర్దశ | కేతు అంతర్దశ | శుక్ర అంతర్దశ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. | సం. నె. రో. |
| రవి | 0- 3- 18 | 0- 6- 0 | 0- 4- 6 | 0- 10- 24 | 0- 9- 18 | 0- 11-12 | 0- 10- 6 | 0- 4- 6 | 1- 0- 0 |
| చంద్ర | 0- 6- 0 | 0- 10- 0 | 0- 7- 0 | 1- 6- 0 | 1- 4- 0 | 1- 7- 0 | 1- 5- 0 | 0- 7- 0 | 1- 8- 0 |
| కుజ | 0- 4- 6 | 0- 7- 0 | 0- 4- 27 | 1- 0- 18 | 0- 11- 6 | 1- 1- 9 | 0-11-27 | 0- 4- 27 | 1- 2- 0 |
| రాహం | 0- 10- 24 | 1- 6- 0 | 1- 0- 18 | 2- 8- 12 | 2- 4- 24 | 2- 10- 6 | 2- 6- 18 | 1- 0- 18 | 3- 0- 0 |
| గురు | 0- 9- 18 | 1- 4- 0 | 0- 11- 6 | 2- 4- 24 | 2- 11- 18 | 2- 6- 12 | 2- 3- 6 | 0- 11- 6 | 2- 8- 0 |
| శని | 0- 11- 12 | 1- 7- 0 | 1- 1- 9 | 2- 10- 6 | 2- 6- 12 | 3- 0 - 3 | 2- 8- 9 | 1- 1- 9 | 3- 2- 0 |
| బుధ | 0- 10- 6 | 1- 5- 0 | 0- 11-27 | 2- 6- 18 | 2- 3- 6 | 2- 8- 9 | 2- 4- 27 | 0-11- 27 | 2-10- 0 |
| కేతు | 0- 4- 6 | 0- 7- 0 | 0- 4- 27 | 1- 0- 18 | 0- 11- 6 | 1- 1- 9 | 0-11-27 | 0- 4- 27 | 1- 2- 0 |
| శుక్ర | 1- 0- 0 | 1- 8- 0 | 1- 2- 0 | 3- 0- 0 | 2- 8- 0 | 3- 2- 0 | 2- 10- 0 | 1- 2- 0 | 3- 4- 0 |

## గ్రామహార్వాణము

నామనక్షత్రము మొదలు గ్రామనక్షత్రమువరకయిన, నక్షత్రములు క్రమముగ శిరమున 5, ముఖమున 3, కుక్షిని 5, పాదముల 6, వీపున 1, నాభిని 5, గుదస్థానము 1, ఎడమచేతిని 1, వేయవలయును. ఇట్లు వేయగా ఆ నక్షత్రము ఏ అవయవమునకు వచ్చునో ఆ ఫలము చెప్పవలయును. శిరస్సు లాభము; ముఖము ధనక్షయము; కడుపు ధనధాన్య ప్రదము; కాళ్లు దరిద్రము; వీపు పీడాప్రదము; బొడ్డు సంపద; గుదస్థానము భయము; కుడిచెయ్యి దుఃఖము; ఎడమచెయ్యి వివాదము కలుగును.

రెండవవిధము:- నామనక్షత్రరాశికి గ్రామనక్షత్రరాశి 2, 5, 9, 10, 11 అయిన నివాసయోగ్యమైనదని చెప్ప వలయును. 4, 8, 12, అయినచే రోగము; 1, 4 అయినచో విరోధము; 3, 6 అయిన హాని కలుగును.

మూడవవిధము:- అ. క. చ. ట. త. ప. య. శ్య అను ఎనిమిదివర్గులలో నామాద్యక్షరవర్గు సంఖ్య నందులో కలిపి, 8చే భాగించగా వచ్చు శేషము, గ్రామాద్యక్షరవర్గు సంఖ్యను 2చే గుణించి నామాద్యక్షరవర్గు సంఖ్యనుచేర్చి 8 చే భాగించగా వచ్చు శేషముకన్న అధికముగనున్నచో, ఆ గ్రామమున నివసించుట శ్రేయస్కరము.

## అంగ గ్రహసంచార ఫలచక్రము

నరాకారముగ నొకచిత్రపటమును వ్రాసి అందు జన్మనక్షత్రము మొదలు, ఆ అవయవముల నక్షత్రముల నిర్దిష్టప్రకారము న్యసించి నవగ్రహములకు ఫలితములు చెప్పవలయును.

ఈ క్రింది చక్రములో ప్రతిగడియందును ఎడమభాగమున ప్రతిమూల నొకసంఖ్యయు, మధ్యనొక సంఖ్యయు, దానిపైన దానిఫలమును వ్రాయబడెను. ఎడమవైపు మూలసంఖ్య చక్రమున నేయవయవము తరువాత నేయవయవమున ఎన్నినక్షత్రములు వ్రాయవలసినవిధానము, ఆవరుస తెలియ పరచును. మధ్యనుండు సంఖ్య ఎన్ని నక్షత్రములను న్యసింపవలసినది ఆ సంఖ్యను తెలుపును. ఫలితము మధ్య భాగములో వ్రాయబడెను. గ్రహముయొక్క దిననక్షత్ర మే యంగమందుండునో ఆ గ్రహమా యంగమందుండును. ఈ విధముగ చక్రమునందలి ఫలితములు తెలుసుకొనవలయును.

| అవయవములు | శిరము | ముఖము | లలాటము | కంఠము |
|---|---|---|---|---|
| రవి | 2<br>ధనము<br>౪ | 1<br>నాశము<br>౧ | 1<br>నాశము<br>౧ | 1<br>నాశము<br>౧ |
| చంద్రుడు | 2<br>క్షేత్రము<br>౪ | 1<br>భయము<br>౨ | 1<br>భయము<br>౨ | 1<br>భయము<br>౨ |
| కుజుడు | 3<br>లాభము<br>౨ | 1<br>మరణము<br>౨ | 6<br>అతిభయము<br>౪ | 6<br>అతిభయము<br>౪ |
| బుధుడు | 2<br>ధనలాభము<br>౩ | 1<br>సంపద<br>౨ | 1<br>సంపద<br>౨ | 1<br>సంపద<br>౨ |
| గురుడు | 1<br>రాజ్యము<br>౪ | 1<br>రాజ్యము<br>౪ | 3<br>రాజ్యము<br>౪ | 3<br>ఐశ్వర్యము<br>౧ |
| శుక్రుడు | 2<br>ధనలాభము<br>౩ | 1<br>మృష్టాన్నము<br>౩ | 1<br>మృష్టాన్నము<br>౩ | 1<br>మృష్టాన్నము<br>౩ |
| శని | 2<br>ధనలాభము<br>౩ | 1<br>మరణము<br>౧ | 2<br>రాజ్యము<br>౩ | 2<br>రాజ్యము<br>౩ |
| రాహువు | 1<br>పట్టాభిషేకము<br>౩ | 2<br>మరణము<br>౧ | 4<br>పూజ్యత<br>౪ | 4<br>పూజ్యత<br>౪ |
| కేతువు | 1<br>రాజ్యలాభము<br>౩ | 2<br>మరణము<br>౧ | 4<br>గౌరవము<br>౪ | 4<br>గౌరవము<br>౪ |

## నరాకార అంగ గ్రహసంచారఫల చక్రము

| అవయవములు | హృదయము | గర్భము | నాభి | నేత్రము |
|---|---|---|---|---|
| రవి | 3 జయము | 3 జయము | 7 లాభము | 7 లాభము |
| చంద్రుడు | 5 శరీరసౌఖ్యము | 5 శరీరసౌఖ్యము | 5 శరీరసౌఖ్యము | 4 విచారము |
| కుజుడు | 6 అతిభయము | 3 జయము | 3 జయము | 8 విదేశగమనము |
| బుధుడు | 8 రాజ్యలాభము | 8 రాజ్యలాభము | 8 రాజ్యలాభము | 8 బంధనము |
| గురుడు | 4 సంతోషము | 4 సంతోషము | 4 సంతోషము | 7 రాజ్యసన్మానము |
| శుక్రుడు | 5 రోగము | 6 వస్త్రలాభము | 6 వస్త్రలాభము | 7 క్షేమము |
| శని | 5 సంపద | 5 సంపద | 5 సంపద | 4 సంతోషము |
| రాహువు | 3 భయము | 5 ధనలాభము | 6 ధనవృద్ధి | 6 ధనవృద్ధి |
| కేతువు | 3 భయము | 5 ధనలాభము | 6 ఐశ్వర్యము | 6 ఐశ్వర్యము |

| సవ్య హస్తము | వామహస్తము | గుహ్యము | పృష్ఠము | పాదము |
|---|---|---|---|---|
| 4 ధనము ౪ | 6 శరీరపీడ ౪ | 8 మరణము ౧ | 8 మరణము ౧ | 5 ధనవ్యయము ౬ |
| 8 ధనము | 8 శత్రుభయం 3 | 8 మరణము ౧ | 3 శత్రుభయము ౧ | 7 అన్యదేశగమనం ౬ |
| 8 ధనము | 7 క్షేమము ౪ | 4 దరిద్రము ౪ | 4 దరిద్రము ౪ | 2 కలహము ౬ |
| 8 సౌఖ్యము | 5 బంధనము ౨ | 4 బంధనము ౪ | 4 బంధనము ౪ | 7 ప్రవాసము ౬ |
| 3 సంపద | 6 మరణము ౪ | 6 మరణము ౪ | 6 మరణము ౪ | 5 శరీరపీడ ౬ |
| 8 నాశము | 4 భయము ౪ | 3 హాని ౨ | 3 హాని ౨ | 31 హాని ౨ |
| 8 ధనము | 6 భయము ౪ | 3 మరణము ౧ | 3 మరణము ౧ | 7 ప్రవాసము ౬ |
| 8 ధనము | 8 ధనము ౪ | 7 ధననష్టము ౧ | 8 రోగాధికము ౪ | 9 ఆరోగ్యము ౬ |
| 8 ధనము | 8 ధనము 4 | 7 పశుహాని ధననష్టము ౧ | 8 రోగము ౪ | 9 సుఖము ౬ |

## మనుష్య నైసర్గిక గుణనిరూపణకు నరాకారచక్రము

జననసమయమునకు సూర్యుడు ఏనక్షత్రమునందుండునో, ఆ నక్షత్రము లగాయితు జననక్షత్రమువరకు లెక్కపెట్టి యీక్రింద తెలుపబడిన వరుసగ అవయవములయందు నక్షత్రములను ఏర్పరచి ఫలితములను చెప్పవలయును.

1. మూర్ధ్వమున 2 ధనప్రాప్తి. 2. లలాటమున 3. ధనవంతుడు, 3. కంఠమున 2 భోగప్రియుడు, 4. భుజములు 2 దుఃఖము లనుభవించువాడు, 5. హస్త యుగమున 2 వ్యభిచరించువాడు, 6. వక్షస్థలమున 4 విశేష ధనవంతుడు, 7 నాభిని 1 దరిద్రుడు, 8. గృహమున 1 జారుడు, 9 జానుయుగ్మమున 3 స్వల్ప ఆయుర్దాయము కలవాడు, 10 పాదములయందు 2 దేశాంతరగమనము.

ఈ విధముగ ఫలితములను చూచి చెప్పవలయును.

గోచారరత్నాకరము సంపూర్ణము.

****

చెన్నపురి: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారి
"వావిళ్ల" ప్రెస్సున ముద్రితము - [redacted]